


# The entertainer extraordinary




ECTV WINS THE TOSS AS THE CHOICEST TV

**ECTV-INDIA'S MOST TESTED/ TRUSTED/ TROUBLE-FREE TV**



Electronics Corporation of India Limited
Hyderabad-500 762




ECTV AND YOU– AN OPENING PARTNERSHIP THAT LASTS FOR YEARS!

**ECTV-INDIA'S MOST TESTED/ TRUSTED/ TROUBLE-FREE TV**



Electronics Corporation of India Limited
Hyderabad-500 762




NO SLIPS WHATSOEVER IN THE QUALITY CONTROL FIELDING!

**ECTV-INDIA'S MOST TESTED/ TRUSTED/ TROUBLE-FREE TV**



Electronics Corporation of India Limited
Hyderabad-500 762




A MATCH WINNER ON ANY TEST PITCH

**ECTV-INDIA'S MOST TESTED/ TRUSTED/ TROUBLE-FREE TV**



Electronics Corporation of India Limited
Hyderabad-500 762






AN UNBROKEN PARTNERSHIP OF SUPERB SOUND AND VISION

**ECTV-INDIA'S MOST TESTED/ TRUSTED/ TROUBLE-FREE TV**



Electronics Corporation of India Limited
Hyderabad-500 762

ASP/ECIL/50/A

## Electronics Corporation of India Limited
## Hyderabad-500 762

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [" కాలక్షేపం విద్యలు "] కు ఆధారం " వసుంధర " రచన.

తమకన్న జీవితానుభవంలో, వయసులో చిన్న వాళ్లయిన వ్యక్తులకు కొందరు పెద్దలు తిరుగులేనివన్న ధోరణిలో సలహాలిస్తుంటారు. "ఉచిత సలహాలు" అన్న కథలో అలాంటివి బెడిసికొట్టడం చూస్తాం.

## అమరవాణి

పరనిందాసు పాండిత్యం, స్వేషు కార్యే ష్వనుద్యమః,
ప్రద్వేషశ్చ గుణజ్ఞేషు, పంథానో హ్యాపదాం త్రయః.

[ఇతరులను నిందించుటలో నేర్పు, స్వకార్యాల పట్ల అలసత, వివేకవంతులతో శత్రుత్వం—ఈ మూడు గుణాలూ మనిషి పతనానికి దారి తీయగలవు.]

సంపుటి 70 ఫిబ్రవరి '82 సంచిక 2

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# పదహారణాల స్నేహం

అత్తవారింటికి కొత్తగా కాపరాని కొచ్చిన అమల, ఇల్లంతా ఒకసారి తిరిగి చూసి, తన అదృష్టాన్ని తానే నమ్మలేకపోయింది. లంకంత ఇల్లు, ఇంటి నిండా నౌకర్లు-యీ జరిగినదంతా ఆమెకు ఒక కలలా తోచింది.

దాదాపు మూడు నెలల క్రితం ఆమె ఒకనాటి సాయంత్రం ఏటి నుంచి నీటి బిందెతో యింటికి తిరిగి వస్తున్నది. దారిలో ఒక అందమైన యువకుడు ఎదురు పడి, ఆమె కేసి ఒకటి, రెండు క్షణాలు పరీక్షగా చూసి, ''మరేం అనుకోకు. నా పేరు సుదర్శనం. నీ పేరేమిటి? ఇల్లెక్కడ?'' అని అడిగాడు.

అపరిచితుడు యిలా పలకరించేసరికి అమల బెదరిపోతూనే, అతడి ప్రశ్నలకు జవాబు చెప్పి, గబగబా ఇంటికి వెళ్లిపోయింది.

ఆ తరవాత పది రోజులకు సుదర్శనం తల్లిని వెంట బెట్టుకుని అమల వాళ్ళ ఇంటికి వచ్చాడు. అసలు విషయం ఆమెకు అప్పుడు తెలిసింది. లోగడ సుదర్శనం ఆమెను ఏటి దగ్గిర పలకరించిన రోజున, తల్లిదండ్రులతో కలిసి, ఆ గ్రామంలో ఒక అమ్మాయిని చూడ వచ్చాడు.

ఆ అమ్మాయి తండ్రి సుదర్శనం తండ్రికి మంచి స్నేహితుడు.

అతిగా అలంకరించుకుని దురుసుగా, ఎబ్బెట్టుగా మాట్లాడిన ఆ అమ్మాయి సుదర్శనానికి నచ్చలేదు. తండ్రి కోపగించుకుని ముందుగా బయలుదేరి తమ ఊరు వెళ్లిపోయాడు. కొంచెం వెనగ్గా ప్రయాణమైన సుదర్శనానికి, ఏటి నుంచి నీరు తెస్తున్న అమల దారిలో తారసపడింది.

మాచిరాజు కామేశ్వరరావు

అమల సవతి తల్లి, అమల అదృష్టానికి చాలా బాధ పడిపోయింది. అయితే, యిరుగూ పొరుగు వాళ్ళ వల్ల నానా మాటలూ అనిపించుకోవలసి వస్తుందని, యీ పెళ్ళికి ఒప్పుకున్నది.

అమల అత్తవారింటికి వస్తూనే, యీ పెళ్ళి తన మామగారికి ఏ మాత్రం యిష్టం లేదని తెలుసుకున్నది. ఆయనకు కట్నం గురించి చింతలేదు; కొడుకు, తన స్నేహితుడి కూతుర్ని కాదన్నాడన్నదే బాధ!

ఆమె ఒకనాడు భర్తతో, "నాకు స్నేహితుడంటూ వున్న ఒక్కరూ, యీ ఊళ్ళోనే వున్నారు. ఆయన్నొకసారి చూడాలి. ఇది, ఎన్నేళ్ళుగానో మనసులో వున్న కోరిక," అన్నది.

సుదర్శనం ఆశ్చర్యపోతూ, "నీకు, యీ ఊళ్లో స్నేహితుడా! ఎవరాయన?" అని అడిగాడు.

"అంత ఆశ్చర్యపోకండి. ఆ స్నేహితుడి కథ యిది," అంటూ అమల జరిగినదంతా చెప్పింది:

అమల పుట్టగానే తల్లి పోయింది. తండ్రి మరొక పెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లి అమలను రాచి రంపాన పెట్టేది. పదేళ్ళు కూడా నిండని అమల చేత ఇంటి చాకిరీ అంతా చేయించేది. బడికి వెళ్ళనిచ్చేది కాదు.



ఇలా వుండగా, సవతి తల్లి తమ్ముడి పెళ్ళి నిశ్చయమైంది. ఆమె పది రోజులు ముందుగానే పెళ్ళికి ప్రయాణమైపోతూ, ఇంటి గదులు అన్నీ తాళంపెట్టి, ముందు గదిలో కుంపటీ, సంచీలో కొంత బియ్యం అమల కోసం వుంచింది.

"నేను పది రోజుల్లో తిరిగొస్తాను. నే నిచ్చే, యీ ఇరవై అణాలతో మజ్జిగా, ఆకుకూరలూ కొనుక్కొని, మహారాణిలా వండుకు తిను," అంటూ ఆమె అమల చేతిలో ఇరవై అణాలు పెట్టి, పిల్లలూ, భర్తతో వెళ్ళిపోయింది.

అమల తండ్రి రెండో భార్య చేతిలో కీలుబొమ్మ.



అమల రెండు పూటలకు సరిపడ వంట చేసుకుని, పగలు భోజనం కాగానే కిటికీ ముందు కూర్చుని, వీధిలోకి చూస్తూ కాలం గడిపేది. ఇలా ఒంటరిగా వుండడం ఆమెకు బెంగ పుట్టించేది.

ఒకనాటి మధ్యాహ్నం వేళ, ఒంటి మీద కట్టుపంచ మాత్రమే వున్న ఒకాయన, వీధిలో నిలబడి, దారినపోయే వాళ్లకేసి చేతులు చాచి, "గ్రహణం అని సముద్ర స్నానానికి వచ్చాను. బట్టలు ఒడ్డునపెట్టి, స్నానం చేస్తూండగా, వాటిని ఎవరో ఎత్తుకుపోయారు. మా ఊరు వెళ్ళేందుకు బాడుగ బండిలో రేవు చేరి, అక్కడ పడవ ఎక్కాలి. ఇందుకు మొత్తం పదహారణాలు అవసరం. సాయం చేస్తే, ఆ డబ్బు మా నౌకరు చేత వెంటనే పంపుతాను," అని దీనంగా అడగసాగాడు.

కాని, ఎవరూ అతడికి సాయం చెయ్యలేదు. తల పక్కకు తిప్పుకుని వెళ్ళిపోసాగారు. ఇది చూసి అమలకు చాలా జాలి కలిగింది. ఆమె గుమ్మం దాకా వెళ్ళి, అతణ్ణి కేకవేసి పిలిచి, దగ్గిరకు రాగానే, "పదహారణాల మాట సరే, భోజనం చేశావా?" అని అడిగింది.

"ముందు మా ఊరు వెళ్ళిపోవాలి, పాపా! నీ పేరేమిటి?" అని అడిగాడతను.

అమల తన పేరు చెప్పి, "నేను పదహారణాలిస్తాను. ముందు భోజనం చెయ్యి," అని, రాత్రికని దాచిన అన్నంలో మజ్జిగ వేసి, అతడికి పెట్టింది.

అతను భోజనం చేసి రకరకాల కథలూ, కబుర్లూ చెప్పి అమలను బాగా నవ్వించాడు.

"ఇంతకూ, మీ ఊరేదో చెప్పావు కాదు," అన్నది అమల.

"నీ ఊరే! అమలాపురం," అంటూ నవ్వాడతను.

అతను పైన కప్పుకోవడానికి, తన తెల్ల పరికిణీ యిచ్చింది, అమల. చిరుగులు కనబడకుండా ఆ పరికిణీ కప్పుకుని

అతను, "ఇదే అదితో, మా ఊరు నుంచి నీకు పట్టుపరికిణీ కుట్టించి పంపు తాను," అన్నాడు.

అమల యిచ్చిన పదహారణాలూ పుచ్చుకుంటున్నప్పుడు అతని చేతులు వణికాయి; కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"పాపా, ఒకవేళ, ఏనాడైనా మా ఊరు రావడం జరిగితే, మా ఇంటికి తప్ప కుండా రా. ఈ వయసులో నీకు అర్థ మౌతుందో లేదో గాని, కష్టంలో ఆదుకున్న వాళ్ళే, నిజమైన స్నేహితులు. చిన్న, కాయితం యిచ్చావంటే, నా చిరునామా రాస్తాను," అని అమల యిచ్చిన కాయితం మీద, తన ఊరూ, పేరూ రాసి యిచ్చి వెళ్ళిపోయాడు.

చదువురాని అమల ఆ కాయితాన్ని బట్టల అడుగున భద్రంగా దాచుకున్నది. రెండు రోజుల తరవాత ఒక మనిషి పట్టు పరికిణీ, వంద రూపాయిలూ తెచ్చి, అమలకు యిచ్చి, "అమలాపురం వచ్చినప్పుడు, తమ ఇంటికి తప్పకుండా రమ్మని, బాబుగారు చెప్పమన్నారు," అన్నాడు.

ఆ వంద రూపాయిల్లో పన్నెండణాలు ఖర్చయేసరికి, అమల సవతితల్లి తిరిగి వచ్చేసింది. ఆమె సంగతి తెలుసుకుని, అమల దగ్గిర్నుంచి మిగిలిన డబ్బు తీసు కున్నది.

ఇది జరిగిన రెండు నెలలకు అమల తండ్రి హఠాత్తుగా జబ్బు చేసి చని



పోయాడు. సవతితల్లి పుట్టిల్లు దూరంగా వున్న ఒక పల్లెగ్రామం. వేరే దిక్కులేని అమల సవతితల్లి వెంట ఆ గ్రామం వెళ్ళి పోయింది.

భర్తకు అమల యిదంతా చెప్పి, "పెళ్ళి నిశ్చయానికి ముందు మీది అమలాపురం అని తెలిసి, నాకు చాలా సంతోషం కలిగింది. తండ్రి ప్రేమ ఎలా వుంటుందో ఆయనవల్ల తెలిసివచ్చింది," అన్నది.

"అంతా బాగానే వున్నది. మరి, ఆయన పేరూ, ఇల్లెక్కడో తెలియాలి కదా? నీకు చదువు రాకపోవడం ఎంత యిబ్బందో చూశావా. ఆ స్నేహితుడిచ్చి పోయిన కాయితం యిటు తీసుకురా," అన్నాడు సుదర్శనం.

అమల పెట్టె అడుగున పట్టుపరికిణీలో పెట్టి దాచిన కాయితం తీసి భర్తకిచ్చింది. సుదర్శనం అది చదివి, పెద్దగా చిటికె వేసి, "నీ చిన్ననాటి స్నేహితుడు, మరెవరో కాదు; మా నాన్నే!" అన్నాడు.

అమల నిర్ఘాంతపోయింది. వయసు పెరగడంతోపాటు ముఖంలో వచ్చిన మార్పులకు తోడుగా, తలంతా తెల్లబడి పోవడంతో ఆమె తన చిన్ననాటి స్నేహితుణ్ణి గుర్తించలేక పోయింది.

సుదర్శనం, తండ్రిని పిలిచి, కాగితం చూపించి, "దీన్ని గుర్తు పట్టగలవా, నాన్నా?" అని అడిగాడు.

సుదర్శనం తండ్రి ఆ కాయితాన్నీ, అమలనూ ఒకటికి రెండుసార్లు తేరి పారచూసి, "నువ్వు, ఆ నాడు కష్ట సమయంలో నన్ను ఆదుకున్న అమల వేనన్న మాట!" అంటూ సంతోషం కొద్దీ కళ్ళల్లో ఉబికే నీరును పై పంచెతో అద్దుకున్నాడు.

"మీ స్నేహబంధం మహా గట్టిది, నాన్నా! పన్నెండేళ్ళ తర్వాత మిమ్మల్ని మళ్లీ కలిపింది," అన్నాడు సుదర్శనం.

"అవునుమరి, మాది అసలైన పదహార ణాల స్నేహం!" అన్నాడు సుదర్శనం తండ్రి నవ్వుతూ.






## 4

[కుండలినీ సైనికులకు తన కోట వశమైపోగానే, మందరదేవుడు నలుగురు సైనికులను వెంట తీసుకొని పడవలలో సముద్రం మీద బయలుదేరాడు. అదేసమయంలో పడవలలో వస్తున్న మరికొందరితో సముద్రం మీద యుద్ధం జరిగింది. ఆ పడవలలో ఉన్నది శివదత్తుడు! అతణ్ణి మందరదేవుడు కుండలినీ రాజ్యపరిస్థితులను గురించి అడిగాడు. తరవాత—]

మందరదేవుడికి, శివదత్తుడి మాటలు చాలా ఆశ్చర్యం కలిగించినై. ఎంతో అనుభవజ్ఞుడూ, ధైర్యశాలీ అయిన సమర సేనుడు కూడా రాజ్యపాలనా వ్యవహారాల్లో ఎలా పొరబాట్లు చేశాడో అతడికి అర్థం కాలేదు. కానని ద్వీపాల్లో, అనేక సాహసకృత్యాలు చేసి తెచ్చిన సంపద, కుండలినీద్వీపవాసులకు మేలు చేయక పోగా కీడుకలిగించిందని అతడికి తోచింది.

"శివదత్తా! సమరసేనుడు, మంత్రాల దీవి నుంచి తెచ్చిన ధనరాసుల ఓడ మీకు సర్వసౌఖ్యాలూ సమకూర్చిందని నేను భావించాను." అన్నాడు మందర దేవుడు.

శివదత్తుడు బిగ్గరగా నవ్వి, "మందర దేవా! ఆ ధనరాసులే కుండలినీ ద్వీపంలో యింత అరాచకానికీ కారణభూతమయినై. మేము ఆ నావతో కుండలినీ ద్వీపం చేరే



సరికి రాజైన చిత్రసేనుడూ, ప్రజలూ మాకు ఘనస్వాగతం యిచ్చారు. వరసగా నెల రోజులపాటు రాజధానీ నగరం వేడుకలతో కళకళలాడింది. చిత్రసేనుడు ప్రజల మీద నామమాత్రంగా వున్న పన్నులు కూడా రద్దు చేశాడు. రాజోద్యోగుల జీతాలు రెండింతలు, మూడింతలుగా పెంచాడు!'' అన్నాడు.

''అయితే, కుండలినీ రాజ్యం లోని ప్రతి ఒక్కరూ సర్వసుఖాలూ అనుభవించారనుకుంటాను, అవునా?'' అన్నాడు మందరదేవుడు.

''మందరదేవా! సావధానంగా వినండి, చెబుతాను!'' అంటూ శివదత్తుడు ప్రారంభించాడు: ''ఎప్పుడైతే ధనాగారం వెండి బంగారాలతో నిండిపోయిందో, అప్పుడే రాజైన చిత్రసేనుడికి రాజ్య పాలనా విషయాల్లో శ్రద్ధ తగ్గింది.

''కావలసినంత ధనం తెచ్చాను. ఇక దేశప్రజలకు లోటేమిటుంటుంది!'' అనుకున్నాడు సమరసేనుడు.

చిత్రసేన మహారాజు, రాజోద్యోగులకు జీతాలు రెండు మూడు రెట్లు పెంచాడని చెప్పాను గదా? ఆ డబ్బుతో వాళ్ళు విలాసాల్లో మునిగిపోసాగారు. ఇక పల్లెల్లోని వ్యవసాయదార్లు కూడా కట్టవలసిన పన్ను చిల్లిగవ్వ పాటి కూడా లేకపోయే సరికి, వాళ్ళకూ నడుం వంచి పంటలు పండించవలసిన అవసరం అంతగా కనపడలేదు. వాళ్ళు కుటుంబ పోషణకు అవసరమైనన్ని తిండిగింజలు మాత్రం పండించుకుని, తతిమ్మా పొలాన్ని బీడుగా వుంచసాగారు. ఆహారపదార్థాల కొరత ఏర్పడింది.

ఈ కారణం వల్ల పట్టణాలకు రావలసిన ఆహారపదార్థాలు రావటం తగ్గింది. పట్టణ ప్రజలు గుంపులు గుంపులుగా గ్రామాలకు బయలుదేరి, ఆహారపదార్థాలను ఒకరికన్న మరొకరు పోటీపడి, ఎక్కువ వెలకు కొనసాగారు. ఆ విధంగా తమ వద్ద చేరిన డబ్బుతో ఏం కొనాలో

తెలియని వ్యవసాయదారులు, వడ్ల ధరలూ, కూరగాయల ధరలూ మరికొంత పెంచారు.

క్రమక్రమంగా రాజ్యం అరాజకంపాలు కాసాగింది. పెద్దపెద్ద మొత్తాలు చెల్లించి ఆహారధాన్యాలు కొనుక్కోలేని పట్టణ వాసులు, ముఠాలుగా బయలుదేరి, రాత్రి వేళల్లో గ్రామాల మీద పడి దోచుకో సాగారు. దీనికి ప్రతిగా గ్రామాల్లో వుండే ప్రజలందరూ ఏకమై, బస్తా వడ్లగింజల విలువ దాని ఎత్తు బంగారం అని నిర్ణయించేశారు. వాళ్ళు, అంతటితో పూరుకోక ముఠాలుగా తయారై, చేతికి దొరికిన ఆయుధాలతో ఆత్మరక్షణకు సర్వసన్నద్ధమయారు.

విలాస కాలక్షేపాల్లో మునిగిపోయిన చిత్రసేన మహారాజుకు యివేమీ తెలియవు. నిజం చెప్పాలంటే; ఆయనతో పాటు నేనూ, సమరసేనుడు కూడా అదే పొరపాటు చేశాం. కారణం, దేశంలో ఏ మూల ఏం జరుగుతున్నదో మాకు తెలియదు. ధనాగారాన్నుంచి, ధనం మంచి నీళ్ళ ప్రాయంగా ప్రజల మీదికి ప్రవహిస్తున్నా దాని అవసరం కలిగినవాళ్ళు చాలా మంది వుండేవాళ్ళు. ఆహారపదార్థాల ధరలు లోగడకన్న వెయ్యిరెట్లు రెండువేల రెట్లు పెరగడంతో ఎవరికీ ఎంత ధనమున్నా చాలేదికాదు.

ఇక, చిత్రసేన మహారాజు కాలక్షేపం కోసం ప్రతిరోజూ ఏర్పాటుచేయించే వినోద



ప్రదర్శనాల్లో వుండే వినోదం చాలా చిత్ర మైంది! ఇప్పుడాలోచిస్తే అవి వినోద ప్రద ర్శనాలు అనేందుకు చాలా సిగ్గుపడుతు న్నాను. కాని అప్పట్లో వాటిని చూసేందుకు ఎంతోదూరాన్నుంచి కూడా జనం వందల వేల సంఖ్యలో వచ్చేవాళ్ళు. ఇక ప్రదర్శనాల సంగతి:

అప్పుడే అడవి నుంచి పట్టుకువచ్చిన ఒక క్రూరమైన సింహాన్ని కటకటాల మధ్య వదిలేవారు. దానిని ఎవరైనా సరే ఖడ్గ మాత్ర సహాయంతో సంహరించగలిగితే, అలాంటి వారికి, చచ్చిన సింహం బరువు బంగారం బహూకరింపబడేది. ధన కాంక్షతో చాలామంది సాహసయువకులు సింహంతో పోరాడేందుకు వచ్చేవారు. దుర దృష్టవంతులు సింహానికి బలి అయ్యే వారు. అదృష్టవంతులు దానిని చంపి, రాజు నుంచి అంత ఎత్తు బంగారమూ గెలుచునేవాళ్లు.

రాను రాను యీ వినోదాలు అతి క్రూరంగా, అనాగరికంగా తయారైనై. ఏను గుల పోరాటాలు, ఏనుగుకూ, సింహానికీ మధ్య పోరాటం.... వినోద ప్రదర్శనలు యీ విధంగా వుండేవి. నేను, సమర సేనుడితో యిందులో వున్న క్రౌర్యాన్ని గురించి చెప్పిచూశాను. కాని, ఆయనకు నా మాట మీద కన్న, లోగడ మంత్రాల




దీవిలో తనతోపాటు వున్న నరవాహనమిశ్రు డనే సైనికుడి మాట మీద ఎక్కువ గురి.

"ధనాగారంలో ధనానికేం కొదవలేదు. రాజు వృద్ధుడు. మన దేశప్రజలను ధైర్య వంతులుగా, సాహసవంతులుగా చేయ వలసిన బాధ్యత కూడా మన మీద వున్నది. అలాంటప్పుడు రాజు వినోదం కోసం యిలాంటి ప్రదర్శనలు ఏర్పాటు చేయటంలో వున్న తప్పేమిటి?" అనే వాడు సమరసేనుడు.

రాజూ, రాజోద్యోగులూ యిలాంటి విలా సాల్లో మునిగివుండగా, గ్రామప్రాంతాల్లో చాలా విచిత్రమైన మార్పులు రాసాగినై. అక్కడ కాస్త బలవంతుడూ, నోరుగల




వాడూ అయిన ప్రతి వ్యక్తి, ఒక చిన్న రాజై కూర్చున్నాడు. కొందరు అనుచరుల్ని సంపాయించటం, పక్క గ్రామం మీద దాడి చేసి, వాళ్ళను లోబరచుకోవటం— ఇదీ పరిస్థితి. ఈ విధంగా ఒకే రాజ్యంలో చిన్న చిన్న రాజ్యభాగాలు ఏర్పడినై. ప్రజలతో పూర్తిగా సంబంధాలు కోల్పోయిన చిత్రసేనుడికీ, అతడి ఉద్యోగులకూ యివేమీ తెలియవు. కొంతగా కొంత యీ దుష్ట పరిణామాల గురించి తెలుసుకున్న నా మాట అప్పట్లో ఎవరికీ రుచించ లేదు.

దేశంలో వర్తకవ్యాపారాలూ, వ్యవసాయం సమూలంగా నాశనమైనై. అన్నిటికీ తెగించిన కొందరు, బందిపోటు ముఠాలుగా తయారై పట్టణాలనూ, పల్లెలనూ దోచుకోసాగారు. కాలక్రమాన చిత్రసేనుడి పరిపాలన రాజప్రాసాదానికి పరిమితమైపోయింది. దేశంలో అతణ్ణి తలచేవాడే లేడు. పుట్టగొడుగుల్లా దేశంలో ఎక్కడ చూసినా రాజులూ, మహారాజులూ, సామ్రాట్టులూ బయలుదేరారు!

ఒకనాటి సాయంకాలం వినోద ప్రదర్శనాలు తిలకిస్తున్న చిత్రసేన మహారాజుకు, ఒక దూత వచ్చి పత్రం ఒకటి చేతికిచ్చాడు. రాజు అది ఏమిటో చూడమని, పక్కన వున్న సమరసేనుడికి యిచ్చాడు. సమరసేనుడు అది చదువుతూనే వెలవెలపోయాడు. అతడి మొహాన కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు.

"మహారాజా, మీరు యిప్పటికి యీ ప్రదర్శనాలు సరిపెట్టి రాజభవనానికి రాకోరుతున్నాను. రాజ్యాంగ విషయం, మీతో మాట్లాడాలి, అవసరం!" అన్నాడు సమరసేనుడు.

చిత్రసేనుడు అయిష్టంగా నా కేసీ, సమరసేనుడి కేసీ చూసి, అక్కడి నుంచి బయలుదేరాడు. నేను శెలవు తీసుకొని వెళ్ళిపోయేటంతలో, సమరసేనుడు నన్నాపి, "శివదత్తా! చాలా ముఖ్య విషయం. నీవు కూడా రావాలి!" అన్నాడు.

ముగ్గురం రహస్య మందిరానికి వెళ్ళాం. సమరసేనుడు, దూత తెచ్చిన పత్రం మాకు చూపుతూ ఇలా చెప్పాడు.

''ఇంతకాలం నుంచీ మనం కళ్ళు వుండీ లేనివాళ్ళం అయాం! ఈ కుండలినీ ద్వీపంలో మనకుతెలియకుండానే కొందరు రాజులూ, మహారాజులూ మొలకలెత్తారు. వాళ్లల్లో కొందరు మనకు ఈ సందేశం పంపారు. వాళ్ళు దుష్టుడూ, అసమర్ధుడూ అయిన రాజును తొలగించదలిచారట! కోట తమ వశంచేసి, లొంగిపొమ్మని- వాళ్ళ అంత్య సందేశం.''

అప్పటిగ్గాని చిత్రసేన మహారాజుకు ఇంతకాలం నుంచి పట్టిన మత్తు వదిలింది కాదు. ఆయన నిద్రలో నుంచి హఠాత్తుగా లేచినవాడి లాగా, సమరసేనుడి కేసి కళ్ళు పెద్దవి చేసి చూశాడు. ఆ వెంటనే కాళ్ళతో నేలను గట్టిగా తన్ని, ''సమరసేనా! రాజ్యపరిస్థితులు కొంత చేజారినట్టే తోస్తున్నది. ఈ పొగరుబోతుల పీచమణచక తప్పదు. తతిమ్మా వాళ్ళకు కూడా గుణపాఠంగా వుండేటట్టుగా, ఆ ముఖ్య నాయకులను పట్టి చిత్రవధ చేయటం మంచిది,'' అన్నాడు.

''సరే, మహారాజా, శెలవు! మళ్ళీ కలుసుకుంటాను,'' అని సమరసేనుడు గది నుండి బయటకు వచ్చేశాడు.



నేను ఏమీ మాట్లాడకుండా ఆయన్ని అనుసరించి కొంత దూరం నడిచాను. హఠాత్తుగా సమరసేనుడు ఒకచోట ఠక్కున ఆగి: ''శివదత్తా! దీన్ని గురించి నీ అభిప్రాయ మేమిటి?'' అన్నాడు. అలా సమరసేనుడు హఠాత్తుగా ప్రశ్నించేసరికి నేను గతుక్కుమన్నాను. దేశం అరాజకస్థితిలో వున్నదనీ, నోరుగల వాళ్ళు కొందరు ప్రజలను కూడగట్టుకొని, వాళ్ళల్లో వాళ్ళు పోరాడుతున్నారనీ తప్ప, నాకు మరేమీ తెలియదు. చివరకు మహారాజునే ఎదిరించేంత బలశాలులు బయలుదేరారనేసరికి నాకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. కాని, ఒకటి: సమరసేనుడికి దేశ పరి

స్థితుల్ని గురించి నాకు తెలిసినపాటి కూడా తెలియదని ఆ సరికి గ్రహించాను!

"శత్రువులు బలశాలురనే నాకు తోస్తున్నది. అలా కానప్పుడు వాళ్ళు నగరం మీద హఠాత్తుగా దాడి చేసి వుండేవాళ్ళు. హెచ్చరిక చేసి, దాడికి రావటం అంటే ....మీరే ఆలోచించి చూడండి!" అన్నాను.

సమరసేనుడు ఒకటి రెండు నిమిషాలు మాట్లాడలేదు. తరవాత తలపంకిస్తూ, "శివదత్తా! నీవు చెప్పినదాంట్లో కొంత సత్యం లేకపోలేదు. అయినా మనకు సుశిక్షితమైన సైన్యం వుంది. అనుభవజ్ఞులూ, సమర్థులూ, నమ్మకస్థులూ అయిన నాయకులున్నారు. కనక ఈ దేశద్రోహుల్ని కాలరాచటం ఎంతోసేపు పట్టదు!" అన్నాడు.

సమరసేనుడు, 'నమ్మకస్థులైన నాయకులు,' అన్నది ఎవరి నుద్దేశించో నాకు చూచాయగా తెలిసినట్టయింది. వాళ్ళు తనతోపాటు మంత్రాలదీవిలో పడరాని పాట్లుపడిన కొద్దిమంది సైనికులూ, వాళ్లల్లో ముఖ్యుడైన నరవాహనమిశ్రుడూ.

"అయితే, యీ ద్రోహుల్ని మట్టుపెట్టడం, ఎంత త్వరగా సాధిస్తే అంత మంచిది. సైన్యాన్ని సమాయత్తపరచండి. మీ నాయకత్వం ఎంతటి కష్ట కార్యాన్నయినా సాధించగలదు." అన్నాను.

సమరసేనుడు నా కేసి ఆశ్చర్యపడుతున్నట్టు చూసి "ఈ స్వల్ప కార్యానికి నువ్వు గానీ, నేను గానీ స్వయంగా సైన్య నాయకత్వం వహించటం హాస్యాస్పదంగా వుంటుంది. నమ్మకస్థుడూ, ధైర్యశాలీ అయిన నరవాహనమిశ్రుడికి ఈ పని వప్ప చెప్ప దలిచాను," అన్నాడు.

నరవాహనమిశ్రుణ్ణి గురించి అప్పటికే కొన్ని విషయాలు విని వున్నాను. అతడి ప్రవర్తన నాకు చాలా కాలంగా అనుమాన కారణం అవుతున్నది. కానీ, ఆ సంగతి సమరసేనుడికి యిప్పటి పరిస్థితుల్లో చెప్పటం శ్రేయస్కరం కాదనిపించింది. అట్లని నాయకత్వం నరవాహనమిశ్రుడికి పోనీయటం ప్రమాదకరం! యిప్పుడు చేయవలసిందేమిటి? —(ఇంకావుంది)






# కాలక్షేపం వి[illegible]లు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ప్రవాహ వేగంలో వున్న నదుల పోకడా, రాజుల చిత్తవృత్తులూ తెలియరానివంటారు. భక్తిగౌరవాలతో కొలుస్తున్న తన మంత్రులకే అర్థంకాని చతురసేను డనే రాజుకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు :

గిరికూట రాజ్యాన్ని పాలించే చతురసేన మహారాజు మంత్రులలో, లోకనాధుడు ఒకడు. అతడి భార్య వైపు బంధువులలో యిద్దరు, రాజుగారి కొలువులో ఉద్యోగాల కోసం ప్రయత్నిస్తున్నారు. రాజుకు వారిని గురించి చెప్పమని లోకనాధుడి భార్య, భర్తను వేధించసాగింది.

## బేతాళ కథలు



అయితే, లోకనాధుడు ప్రయత్నలోపం మాత్రం చెయ్యలేదు. భార్య బంధువుల్లో ఒకడు మంచి కవి, రెండవవాడు సమర్థుడైన జ్యోతిష్కుడు. ఈ యిద్దరినీ దృష్టిలో వుంచుకుని లోకనాధుడు రాజుకు సూచనప్రాయంగా, "ప్రభూ, మన కొలువులో ప్రతిభావంతులైన కవులూ, జ్యోతిష్కులూ వుండడం బావుంటుంది," అని ఒకటి, రెండుసార్లు చెప్పి చూశాడు.

కాని రాజు చతురసేనుడు, "ప్రస్తుతం మనది చాలా బీదదేశం. దేశంలో ప్రజలందరూ సుఖంగా వుండేవరకూ, కళాపోషణ గురించి ఆలోచించ దలచలేదు," అనేశాడు.

లోకనాధుడు తన సమస్య గురించి మరొక మంత్రికి చెప్పుకున్నాడు.

"రాజుల మనోవృత్తులు చిత్రమైనవి. ఏదైనా మంచి సమయం చూసి, నీ బంధువుల ప్రతిభను ఆయన ముందు ప్రదర్శించమను. అప్పుడు రాజుగారే వాళ్ళను కొలువులో చేర్చుకుంటారు," అన్నాడు మంత్రి.

లోకనాధుడికి యీ సలహా నచ్చింది. ఆ రోజు నుంచీ మంచి అవకాశం కోసం ఎదురుచూడసాగాడు. ఒకరోజున రాజు, లోకనాధుడితో కలిసి మారువేషంలో మరొక నగరం వెళ్ళి, అక్కడి పరిస్థితుల్ని రహస్యంగా పరిశీలించాలనుకున్నాడు. ఈ సంగతి ముందుగానే తెలియడంవల్ల, లోకనాధుడు తన బంధువు లిద్దర్నీ పిలిచి, ఫలానా నగరంలో, ఫలానా రోజున రాజును కలిసి విద్యలను ప్రదర్శించమని చెప్పాడు.

తీరా ప్రయాణం రోజున రాజు ముందు అనుకున్న నగరానికి కాక, మరొక నగరానికి బయలుదేరాడు. లోకనాధుడు కంగారుపడిపోయి, "ప్రభూ, మనం అనుకున్నది, యీ నగరానికి కాదు గదా!" అన్నాడు.

అందుకు చతురసేనుడు నవ్వి, "చివరిక్షణం వరకూ, నా కార్యక్రమం గురించి ఎవ్వరికీ నిజం తెలియకూడదు. ఇది, నా పద్ధతి," అన్నాడు.

లోకనాధుడు రాజుకు తెలియకుండా, యీ సంగతి ఒక నమ్మకస్థుడి ద్వారా ఇంటికి కబురుచేశాడు. అయితే, అప్పటికే అతడి బంధువులు ప్రయాణమైపోయారు.

లోకనాధుడు దిగులుగానే రాజుతో ప్రయాణమయ్యాడు. వారు చేరిన నగరంలో యిద్దరూ ఒక పేద బ్రాహ్మడి యింట విడిది చేశారు. రాజు ఆ బ్రాహ్మణ్ణి అడిగి, నగర పరిపాలన గురించి చాలా విశేషాలు తెలుసుకున్నాడు. రోజంతా లోకనాధుడూ, చతురసేనుడూ నగరం తిరిగి, రాజును గురించి ప్రజలేమనుకుంటున్నారో తెలుసుకునేవారు. అలా రెండురోజులు గడిచాయి. ఒకరోజున యిద్దరూ విడిదికి తిరిగి వచ్చేసరికి, బ్రాహ్మడు చెయ్యి చూసి ఎవరికో జోస్యం చెబుతున్నాడు.

"నీకు జోతిష్యం తెలుసునా?" అని రాజు ఆశ్చర్యంగా బ్రాహ్మణ్ణి అడిగాడు.

"చెయ్యి చూసి ఎవరికైనా భూత భవిష్యద్వర్తమానాలు చెప్పగలను," అన్నాడు బ్రాహ్మడు.

"అయితే, నాకూ చెబుతావా?" అంటూ రాజు చెయ్యి చాపాడు.

బ్రాహ్మడు రాజు చెయ్యి పరీక్షించి చూసి, "నువ్వు భాగ్యవంతుడివి. అయితే, నీకు శక్తికిమించిన ఆశలున్నాయి. ఎప్పటికైనా రాజువు కావాలని, నీ ఆశ; కాని,



ఎప్పటికీ నువ్వు రాజువి కాలేవు. ఉన్న దానితో తృప్తిపడితే, నీ అంత అదృష్టవంతుడు మరొకడుండడు," అన్నాడు.

రాజు, బ్రాహ్మణ్ణి మెచ్చుకుని, "యింకా ఏమైనా విశేషాలు చెప్పు," అన్నాడు.

జ్యోతిష బ్రాహ్మడు చాలావరకు తప్పులే చెప్పాడు. అయినా రాజు అతణ్ణి వదలక, ఎన్నో ప్రశ్నలు వేసి, చాలాసేపు జోస్యం చెప్పించుకున్నాడు.

తరవాత రాజు అతణ్ణి, "నీకు యీ విద్య ఎలా వచ్చింది?" అని అడిగాడు.

"స్వతహాగా నేను కవిని. మా ఇంట్లో పూర్వీకులు వదిలిపోయిన గ్రంథాలెన్నో వున్నవి. అవి తిరగేస్తుంటే, హస్తసాము



ద్రిక గ్రంథం కనబడింది. అప్పటి నుంచీ జ్యోతిషం చెప్పడం ఆరంభించాను,'' అన్నాడు బ్రాహ్మడు.

''నువ్వు కవివి కూడానా ? అయితే, ఏదైనా కవిత్వం చెప్పు, వింటాను !'' అన్నాడు రాజు.

బ్రాహ్మడు తను రాసిన పద్యాలు చదివి వినిపించాడు. అందులో ఎన్నో తప్పులున్నపని, సాహిత్యంతో అంతగా పరిచయం లేని లోకనాధుడికే అనిపించింది. అయితే, రాజు మాత్రం ఆ కవిత్వాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు.

వాళ్ళు నగరంలో మరి రెండు రోజులున్నారు. ఆ రెండు రోజులూ కూడా చతురసేనుడు తీరిక దొరికినప్పుడల్లా, బ్రాహ్మడి కవిత్వం వింటూ కాలం గడిపాడు. తిరుగు ప్రయాణమై వెళ్ళేప్పుడు అయన బ్రాహ్మడికి వంద బంగారు కాసులు బహుమానంగా యిచ్చి, ''నీ విద్యలో మరింతగా కృషి చేశావంటే, ఇంకా గొప్ప కవివీ, జ్యోతిష్కుడివీ అవుతావు,'' అన్నాడు.

ఈలోగా, లోకనాధుడి బంధువులకు, అతడి భార్య ద్వారా సరి అయిన సమాచారం తెలిసి, రాజున్నచోటుకు బయలుదేరారు. వాళ్ళకు తిరుగు ప్రయాణమై వస్తున్న లోకనాధుడూ, రాజూ కనిపించారు. లోకనాధుడు ఎలాంటి మారు వేషంలో వుండేదీ ముందే తెలుసు గనక, వాళ్ళు తమ బంధువును సులభంగా గుర్తించారు. ఇక, పక్కన వున్నది రాజు చతురసేనుడు.

జ్యోతిష్కుడు చతురసేనుడితో, ''ముఖంచూసి, మనిషి మూడు తరాలు అటూ, యిటూ సర్వం చెప్పగలను. ఈ మహామనీషి మారువేషంలో వున్న, ఏ మహారాజో అయివుండాలి!'' అన్నాడు.

ఆ వెంటనే కవి, ''అలా అయితే, ఆ మహారాజును కీర్తిస్తూ, నేనొక పద్యం చదవక తప్పదు,'' అంటూ ఒక పద్యం చదివాడు.

లోకనాథుడు రాజుతో, "వీళ్ళు అసాధారణమైన పండితుల్లా వున్నారు, ప్రభూ! తమ కొలువుకు రప్పించుకుంటే బావుంటుంది గదా," అన్నాడు.

చతురసేనుడు చిరాగ్గా, "వీళ్లు గొప్ప పండితులనేందుకు సందేహం లేదు," అంటూ, ప్రయాణం సాగించాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, చతురసేనుడి ప్రవర్తన అసందర్భంగా కనిపించడం లేదా? నగరంలో అపండితుడైన బ్రాహ్మణుడి కవిత్వం, జ్యోతిషం విని, అతడికి బంగారు కాసులు బహూకరించాడు. అటువంటివాడు, నిజమైన పండితుల్లాగా జ్యోతిష్యమూ, కవిత్వమూ చెప్పిన వారికి కొలువులో ఎందుకు ఉద్యోగాలు యివ్వలేదు? వాళ్ళు, తన మంత్రి బంధువు లనీ, తనను గురించి సర్వం ముందే తెలుసుకుని వచ్చినవాళ్లనీ గ్రహించాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజుకు, ఆ వచ్చినవాళ్ళు మంత్రి బంధువులని తెలిసే అవకాశం ఏమాత్రం లేదు. మంత్రితో అన్న మాటను బట్టి, వాళ్ళు నిజమైన పండితులన్న భావం కూడా ఆయనకు కలిగింది. అయితే, కళాపోషణను గురించి తనకున్న అభిప్రాయం లోగడే ఒకసారి మంత్రికి చెప్పాడు; తమది బీదదేశం, ముందు ప్రజల సుఖం చూశాకే, కళాపోషణ విషయం ఆలోచించాలని. ఇక, రాజు విడిది చేసిన ఇంటి బ్రాహ్మణుడి కవిత్వం, జ్యోతిషం గురించి. బ్రాహ్మణుడికి ఆ రెండింటిలో, ఏ ఒక్కదానిలోనూ పాండిత్యంలేదు. అయితే, రాజు అతణ్ణి మెచ్చుకోవడానికి కారణం ఏమంటే, నగరంలో ఆయనకు అంతకన్న వినోద కాలక్షేపానికి మరెక్కడా అవకాశం లేకుండా పోవడం," అన్నాడు.

రాజుకు యీ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఎన్ని గుండెలు !

ఒక గ్రామంలో నారయ్య, సిద్దయ్య అనే యిద్దరు పేద రైతులుండేవారు. ఒకనాడు సిద్దయ్య సంతకు పోతూండగా, నారయ్య అతణ్ణి ఏం కొనబోతున్నావని అడిగాడు. ఆవును కొనేందుకు పోతున్నట్టు చెప్పాడు, సిద్దయ్య.

"అయితే, మనిద్దరికీ శ్రమ తప్పింది. నేను, మా ఆవును అమ్మేందుకు సంతకు తోలుకు పోవాలనుకుంటున్నాను. వచ్చి చూడు," అన్నాడు నారయ్య.

సిద్దయ్య పోయి ఆవును చూసి బేరమాడి, మూడువందలు చెల్లించి యింటికి తోలుకు పోయాడు.

ఆవు ఆ రాత్రి ఏదో జబ్బుతో బాధపడి, తెల్లవారేసరికి చచ్చిపోయింది. సిద్దయ్య సంగతి చెప్పి, నారయ్యను తన డబ్బు వాపసు యివ్వమని అడిగాడు. నారయ్య అందుకు ఒప్పుకోలేదు. సిద్దయ్య, అతణ్ణి వెంటబెట్టుకుని గ్రామాధికారి దగ్గిరకు పోయాడు.

"నారయ్యా, ఆవు అంత హఠాత్తుగా చచ్చిపోయిందంటే, దానికి లోగడనే నయంకాని వ్యాధి వుండివుంటుంది. నువు, సాటివాణ్ణి యిలా మోసగించడం క్షమించరానిది. ఆ మూడు వందలూ సిద్దయ్యకు యిచ్చెయ్యి," అన్నాడు గ్రామాధికారి.

నారయ్య యిందుకు అంగీకరించలేదు. గ్రామాధికారి ఒకక్షణం ఆలోచించి, "నారయ్యా, ఒకవేళ నేనే ఆవును కొని, యిలా నష్టపోయి వుంటే, ఏం చేసేవాడివి?" అని అడిగాడు.

"గ్రామాధికారులైన తమకు అసలా ఆవును అమ్మడానికి నా కెన్ని గుండెలు!" అన్నాడు నారయ్య.

మోసం బయటపడింది. సిద్దయ్యకు మూడువందలతో పాటు, జరిమానా కింద నారయ్య చేత మరొక వందరూపాయలు అదనంగా యిప్పించాడు, గ్రామాధికారి. — కె. కె. రఘునందన






మలయ రాజ్యాన్ని పరిపాలించే కేతు వర్మ, తన కొడుకు జయవర్మకు వివాహం చేయ నిశ్చయించాడు.

మలయ రాజ్యానికి సరిహద్దులోనే కర్పూర రాజ్యం వున్నది. ఆ రాజు కూతురు పుష్పవల్లి గొప్ప సౌందర్యవతి అని అందరూ చెప్పుకునేవారు. తన వివాహప్రసక్తి వచ్చినప్పుడు జయవర్మ తండ్రితో, తానామెను వివాహమాడగోరు తున్నట్టు తెలియబరిచాడు.

కేతువర్మకు కుమారుడి కోర్కె గడ్డు సమస్యగా పరిణమించింది. మలయ, కర్పూర రాజ్యాల మధ్య ఒకప్పుడు ఎడతెరిపిలేని యుద్ధాలు జరిగినై.

రాజు కేతువర్మ, మంత్రికి సంగతి చెప్పి, సలహా అడిగాడు.

"మహారాజా, మలయ, కర్పూర రాజ్యాల మధ్య యుద్ధాలూ, శత్రుత్వం అన్నది ఏనాటిమాట! మీరు సందేహించక, తమ అభిమతం ఏమిటో, ఆ రాజుకు ఉత్తరం ద్వారా తెలియపరచండి," అన్నాడు మంత్రి.

కేతువర్మ, కర్పూర దేశపు రాజుకు తన కుమారుడి వివాహం గురించి తెలియ పరుస్తూ, రాకుమారి పుష్పవల్లి చిత్రపటం పంపవలసిందిగా లేఖ రాశాడు. కొద్ది రోజుల్లోనే పుష్పవల్లి చిత్రపటం కేతు వర్మకు చేరింది. రాకుమారి అందచందా లకు యువరాజు జయవర్మతో పాటు అందరూ ఆశ్చర్యపోయారు.

కాని, ఆస్థాన పండితుల్లో ఒకరు రాజుతో, "మహారాజా, యీ చిత్రపటం తయారు చేసినవాడు కర్పూరదేశపు ఆస్థాన చిత్రకారుడు. అలాంటి వాళ్లు తలుచు కుంటే, కురూపినైనా, మహా సౌందర్య వతిగా చిత్రించగలరు. కనక, మన

చిత్రకారులను పంపి, వాళ్ళ ద్వారా పుష్పవల్లి చిత్రాలను తెప్పించడం ఉచితంగా వుంటుంది," అన్నాడు.

రాజుకు పండితుడి సలహా నచ్చింది. ఆయన ప్రతిభావంతులుగా పేరు మోసిన ముగ్గురు చిత్రకారులను కర్పూర రాజ్యానికి పంపాడు. వాళ్ళు వారం రోజుల్లో తిరిగి వచ్చారు.

ముగ్గురు చిత్రకారుల్లో ఒకడు రాజ కుటుంబం వారికి తాను చిత్రించిన పుష్పవల్లి చిత్రాన్ని చూపాడు. రాజు కేతువర్మతోపాటు అందరూ అచ్చెరువు చెందారు. ఈ చిత్రం కర్పూర రాజు పంపినదానికన్న అద్భుతంగా వున్నది.

రాజు ఆ చిత్రకారుడికి బహుమానం యిచ్చి పంపేశాడు. రెండవ చిత్రకారుడు తాను గీసిన చిత్రం చూపించాడు. ఇందులో రాకుమారి అప్సరసలను మించిన సౌందర్యంతో వెలిగిపోతున్నది. రాజు యీ చిత్రకారుడికి మొదటివాడి కన్న పెద్ద బహుమానం యిచ్చాడు.

మూడవ చిత్రకారుడు కదలక మెదలక వుండడం చూసి రాజు కేతువర్మ, అతణ్ణి, "ఏదీ, నువు చిత్రించిన రాకుమారి చిత్రపటం?" అని అడిగాడు.

"మహారాజా, క్షమించాలి. నేను రాకుమారిని చిత్రించనే లేదు. ఆమె సౌందర్యంలో దేవకన్యల కేమీ తీసిపోదు. చూడవలసిందే తప్ప, ఆ అందాన్ని చిత్రించడం ఎంత గొప్ప చిత్రకారుడికీ సాధ్యపడదు. ఈ కారణం వల్లనే, కర్పూరరాజ్య చిత్రకారుడు ఆమెను ఒక విధంగా, మన చిత్రకారులు మరొక రకంగా చిత్రించారు. వీటిలో ఏది పుష్పవల్లికి సరి అయిన ప్రతిరూపమో, మీరు ఆలోచించనే లేదు!" అన్నాడు మూడవ చిత్రకారుడు.

రాజు తను చేసిన పొరపాటు గుర్తించి, రాకుమారి చిత్రమే గీయని మూడవ చిత్రకారుణ్ణి ఘనంగా సన్మానించి, కర్పూర దేశ రాజుతో తాను వియ్యమందనున్నట్టు ఆస్థాన పండితుడి ద్వారా లేఖ పంపాడు.





# భాషరాని పండితుడు

చంద్రగిరిరాజు జయచంద్రుడు, కవి పండితపోషకుడు. కవులమనీ, పండితులమనీ చెప్పినవారికి, ఆయన ఆస్థానంలో సులువుగా ప్రవేశం లభించేది. కవి దిగ్గజమని బిరుదు వహించిన రుద్రకవి, ఆస్థాన ప్రధాన విద్వాంసుడు. పాండిత్యంలో యితణ్ణి మించిన విశాలు డనే గొప్ప పండితుడుండేవాడు. కాని, ఆయన అంతగా లౌక్యుడు కాదు. ముఖస్తుతికి మురిసిపోయే రాజు దగ్గిర రుద్రకవికి చాలా పలుకుబడి వుండేది.

అతడు రాజుకు తనపై వున్న నమ్మకాన్ని ధనసంపాదనకు ఉపయోగించుకునేవాడు. తనను ఆశ్రయించినవారికి నాలుగు కవిత్వపు పలుకులు నేర్పి, వాటిని రాజు ముందు ప్రదర్శింపజేసి, వాళ్ళకు ఆస్థానంలో ఉద్యోగాలు యిప్పించేవాడు.

ఒకనాడు రుద్రకవి దగ్గిరకు చపలు డనే వాడు వచ్చాడు. అతడికి చెప్పదగిన భాషాజ్ఞానం లేదు. అయినా, రాజుగారి కొలువులో తనకు ఉద్యోగం కావాలని, పెద్ద లంచం ఆశచూపాడు.

రుద్రకవి, అతడికి నాలుగు పద్యాలు చెప్పి కంఠస్థం చేయించాలని చూశాడు. కాని, చపలుడు తేలికయిన పదాలను కూడా సరిగా ఉచ్చరించలేకపోయాడు. ఇలాంటివాడు పండితుల మధ్య నోరు విప్పితే, అసలు బండారం బయటపడి పోతుంది!

బాగా ఆలోచించి రుద్రకవి ఒక పథకం తయారు చేశాడు. ఏం చెయ్యవలసిందీ చపలుడికి వివరంగా చెప్పాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆస్థానంలో పండితుల మధ్య నోరు తెరవవద్దని, అతణ్ణి గట్టిగా హెచ్చరించాడు.

బొమ్మడి అచ్చారావు

మర్నాడు సభతీరివున్న రాజు జయచంద్రుడి దగ్గిరకు రుద్రకవి, చపలుణ్ణి వెంటబెట్టుకుపోయి, "ప్రభూ, ఈయన మహా విద్వాంసుడు. వేదార్థసార మెరిగినవాడు. తన పాండిత్యాన్ని హస్త, శిరోచేష్టల ద్వారా తెలియపరుస్తాడు," అని చెప్పాడు.

రాజు చాలా సంతోషించి, "అయితే, వీరి పాండిత్యం ఏపాటిదో తెలుసుకో దలుచుకున్నాను," అన్నాడు.

రుద్రకవి, చపలుడితో, "విన్నారు గదా! ఇప్పుడు నా సందేహం ఒకదానికి, సమాధానం చెప్పండి. ఈ జగత్తుకంతకూ మూలాధారం ఎవరు?" అన్నాడు.

చపలుడు ఏమాత్రం సంకోచించకుండా, ఆకాశం కేసి చేతులెత్తి భగభగమండుతున్న సూర్యబింబాన్ని అభినయించాడు.

రుద్రకవి రాజుతో, "ప్రభూ, ఈయన పండితుడే కాదు; గొప్ప వేదాంతి కూడా. నే నడిగిన ప్రశ్నకు సాధారణంగా ఏ పండితుడైనా, భగవంతుడని సమాధానం యిస్తాడు. కాని, ఈయన సూర్యభగవానుణ్ణి ఉదహరిస్తున్నాడు. సూర్యుడు లేకుండా జీవరాశి మనుగడ లేదు గదా? వర్షాలుండవు," అని భాష్యం చెప్పాడు.

రాజు, "ఆహాఁ," అన్నాడు.

రుద్రకవి చపలుణ్ణి, "మన శరీరంలో ప్రధానమైన భాగం ఏదో చెప్పగలరా?" అని అడిగాడు.



చపలుడు తడుముకోకుండా ముక్కు చూపించాడు.

రుద్రకవి సంతోషంగా, "ప్రభూ, మన పూర్వులన్నది శరీర భాగాలన్నిటి లోనూ కన్ను ప్రధానమైనదని. కాని, ఈ వేదపండితుడు ముక్కు ప్రధానమైన దని చెప్పడంలో గొప్ప సత్యం వున్నది. కళ్ళు లేకపోయినా జీవించగలం గాని, గాలి పీల్చుకునేందుకు ముక్కు లేకపోతే క్షణాల మీద ఆయువు చెల్లిపోతుంది," అన్నాడు.

రాజు యీ జవాబుకూ ఆనందంగా తలాడించాడు.

రుద్రకవి, చపలుడితో, "కవి, రాజుల్లో ఎవరు గొప్ప?" అన్నాడు.

చపలుడు చేయెత్తి రుద్రకవిని చూపి, తరవాత రాజును చూపి, కాదన్నట్టు తలాడించి, మళ్ళీ రాజునూ, రుద్రకవినీ చూపి, ఔనన్నట్టు తలాడించాడు.

సభలో వారికి చపలుడు, మహారాజు కన్న రుద్రకవి ఉన్నతుడని సూచిస్తున్నా డన్న భావం కలిగింది. రాజుకు కూడా యిది వింతగానూ, అవమానకరంగానూ తోచింది.

రుద్రకవి పరిస్థితి విషమించకుండా వెంటనే, తన భాష్యం యిలా చెప్పాడు: "ప్రభూ, వేదాంతసాగరం మథించిన మహాపండితులు వీరు! పైకి వేరొకలా కనిపించినా, తరిచి చూసినప్పుడు అందులో ఎంత నిగూఢభావం వున్నదో



అర్థమవుతుంది. ముందు నన్ను చూపి, తరవాత మిమ్మల్ని చూపాడు. అంటే కవిరాజు అని అర్థం. అయితే, యిందులో ఎవరు గొప్ప అన్న సమస్యకు మిమ్మి చూపి, నన్ను చూపాడు. ఇక్కడ కవిరాజు నేనయితే, రాజకవి తమరు. అంటే, కవి కన్న రాజే ఉన్నతుడని భావం.''

రాజు జయచంద్రుడు పట్టరాని ఆనందంతో సింహాసనం మీది నుంచి లేచి, మెడలోని వజ్రాలహారం తీసి, చపలుడికి కానుకగా యిస్తూ, ''తమ పాండిత్యం, హేతుబద్ధమైన జవాబులూ, నాకు చాలా సంతోషం కలిగించాయి. మిమ్మల్ని, నా ఆస్థాన విద్వాంసులుగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

అంతలో విశాలుడు, ''మహా పండితుల వారికి, నా చిన్న సందేహం ఒకటి మనవి చేస్తాను. నా అభిప్రాయంలో జగత్తుకు మూలం తల్లిదండ్రులు. వారులేనిది మీరు లేరు; నేనులేను. నేను అనేది జగత్తుకు ఆధారం కదా ?'' అన్నాడు.

చపలుడు నివ్వెరపడుతూ రుద్రకవి కేసి చూసి గుటకలు మింగసాగాడు.

విశాలుడు వెంటనే, ''అయ్యో, తమరు మూగవారా ? ఇంత గొప్ప పండితులు మూగవారు కావడం, ఆ సరస్వతీదేవి దురదృష్టం !'' అన్నాడు.

చపలుడు ఉక్రోషంగా, ''నేనేం మూగోణ్ణి కాదు. నువ్వేం రుద్రకవయ్యే కన్న మొనగాడివా ?'' అన్నాడు.

ఆ మాటలతో రాజుతోపాటు, సభలో వున్న వారందరికీ చపలుడికున్న భాషాజ్ఞానం ఏపాటో తెలిసిపోయింది. అతడు చెప్పిన సంకేత సమాధానాలన్నీ రుద్రకవి నూరిపోసినవని అర్థమైంది.

రాజు ఉగ్రుడైపోయి, అప్పటికప్పుడు విచారణ జరపగా, రుద్రకవి లంచగొండితనం బయటపడింది. ఆయన అప్పటికప్పుడే రుద్రకవిని ఆస్థానం నుంచి బహిష్కరించి, నిజమైన పండితుడు విశాలుణ్ణి, తన ప్రధాన విద్వాంసుడుగా నియమించాడు.





# అనాదరణీయుడు

బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పాలించే కాలంలో బోధిసత్వుడు, ఆయన వద్ద పండితామాత్యుడుగా వుండేవాడు.

ఒక సందర్భంలో కాశీ రాజైన బ్రహ్మ దత్తుడికి తన కుమారుడిపై కోపం కలిగి, అతన్ని రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. రాజుకొడుకు, భార్యా సమేతుడై దేశాం తరాలలో చాలాకాలం పాటు అనేక కష్టాలు పడ్డాడు. నిలిచే నీడలేకా, తిన డానికి తిండిలేకా భర్త కష్టాలనుభవి స్తూంటే, మహాసాధ్వి అయిన ఆయన భార్య ఎంతో ఓర్పుతో, ఆ కష్టాలన్నిటినీ తాను కూడా అనుభవించింది.

ఇలా కొంతకాలం జరిగాక బ్రహ్మ దత్తుడు చనిపోయాడు. ఆ కారణంగా ఆయన కొడుకు స్వదేశం తిరిగి రావ డానికి అడ్డంకి తొలగిపోయింది. తండ్రి చనిపోయినట్టు తెలియగానే, రాజు కొడుకు పరమానందభరితుడయ్యాడు. ఎప్పుడు కాశీ చేరదామా, ఎప్పుడు సింహాసనం మీద కూచుందామా అన్న ఆదుర్దాలో, బ్రహ్మదత్తుడి కొడుకు అతి వేగంగా కాశీమార్గం పట్టి రాసాగాడు.

తన భార్య తనతో సమంగా నడవ లేదనీ, తన కష్టాలలో ఆమె భాగం పంచు కున్నట్టే, ఆమె కష్టసుఖాలు తను గమ నించాలనీ, ఆ మూఢుడికి తోచలేదు. అందుచేత రాజుకొడుకు ఆహార విశ్రాం తులు కూడా పాటించకుండా రాత్రిం పగళ్ళు తాను నడిచి, భార్యను కూడా తనతో సమంగా నడిపించాడు.

ఎంత సింహాసన కాంక్ష వున్న వాడైతే మాత్రం, ఆహార విశ్రాంతులు లేకుండా ఎంత దూరమని నడవగలడు! భార్యతో పాటు అతడికి కూడా ఆకలి వేసింది. ఈ ఆకలితోనే నడిచి, నడిచి వారిద్దరూ

జాతక కథ



ఒక ఊరు చేరారు. అక్కడ కొందరు వీరి దుస్థితి చూసి, "అయ్యో, చాలా ఆకలితో ప్రయాణం చేస్తున్నట్టున్నారు? ఇంత భోజనం పెడతాం, మూట కట్టుకు పోయి తినండి," అన్నారు.

బ్రహ్మదత్తుడి కొడుకు తన భార్యను ఒకచోట విశ్రాంతి తీసుకోమని చెప్పి, భోజనం పెడతామన్న వారి వెంట వెళ్ళాడు. అతడికి వాళ్ళు యిద్దరికి సరి పడే ఆహారం ఆకులో కట్టి యిచ్చారు.

దాన్ని తీసుకుని రాజుకొడుకు భార్య వున్న చోటుకు తిరిగి వస్తూ, యిలా ఆలోచించాడు: ఈ భోజనం, తనూ భార్యా కలిసి తింటే, మళ్లీ రెండో పూటకే ఆకలి వేస్తుంది. తిరిగి భోజనం ఎప్పటికి దొరుకు తుందో! తాము నడవవలసిన దూరం యింకా చాలా వుంది. తాను కాశీకి చేరడం ప్రధానంగాని, తన భార్య చేరడం ప్రధానం కాదు. తాను త్వర త్వరగా ప్రయాణం సాగించడానికి, ఆమె అసలే ప్రతిబంధకంగా వున్నది. అందు చేత ఏదైనా ఉపాయం చేసి, ఈ ఆహార మంతా తానే తినెయ్యాలి!

ఆ నీచుడు యీ విధంగా ఆలోచన చేసి, భార్య వున్న చోటుకు వెళుతూనే, "నువు ముందు నడుస్తూ వుండు. నేను కాలకృత్యాలు ముగించుకుని కొంచెం వెనగ్గా వచ్చి కలుసుకుంటాను," అన్నాడు.

అతడి భార్య యీ మాటలు నిజమని నమ్మి ముందు పోసాగింది. ఆమె వెళ్ల గానే రాజుకొడుకు ఆహారమంతా తానే తిని, ఆకులన్నీ వదులుగా పొట్లం చుట్టి, గబగబా నడుస్తూ భార్యను చేరుకున్నాడు.

భార్య చేతిలో వున్న పొట్లం కేసి చూసేంతలో అతడు కోపం నటిస్తూ, "ఈ ఊరి వాళ్ళెంత మోసగాళ్లో చూడు! ఉత్త ఆకులు పొట్లం కట్టి, ఆహారమంటూ యిచ్చారు," అన్నాడు.

అతడి భార్యకు నిజం తెలిసినా, భర్త మీది గౌరవం కొద్దీ ఏమీ అనకుండా

పూరుకున్నది. మరి కొంత కాలం ప్రయాణం చేసి వారు ఎలాగైతేనేం, కాశీ చేరారు. బ్రహ్మదత్తుడి కొడుకు రాజ్యాభిషేకం సక్రమంగా జరిపించుకుని, కాశీ రాజైనాడు.

రాజయాక అతడికి తన భార్యను గురించి ఆలోచించే అలవాటు బొత్తిగా లేకుండా పోయింది. తన కష్టాలను ఎంతో సహనంతో పంచుకున్న భార్యకు, తన సుఖాలలో భాగ మివ్వాలని అతనికి తట్టనేలేదు. ఆమె మంచి బట్టలు వేసుకున్నదో లేదో, సరిగా భోజనం చేసిందో లేదో — రాజు ఎన్నడూ విచారించిన పాపాన పోలేదు. అందుచేత రాణి కష్టకాలం తీరిపోయినా, పూర్వంలాగే విచార సముద్రంలో మునిగి వుండసాగింది.

రాజు వద్ద పండితామాత్యుడుగా వుంటున్న బోధిసత్వుడు రాణి విచారాన్ని గమనించి, ఒకసారి ఆమెను చూడ బోయాడు. రాణి ఆయనను ఆదరించి ఉచిత మర్యాదలు చేసింది.

"అమ్మా, తమ కష్టాలు తీరి మంచి రోజులు వచ్చినందుకు రాజుగారు ఎన్నో బహుమతు లిచ్చారు. కాని, నీ చేతి మీదుగా నాకు యీనాటి వరకూ ఏ విధమైన బహుమతీ ముట్టలేదు," అన్నాడు బోధిసత్వుడు.



"బాబూ, నేను పేరుకు రాణినిగాని, వాస్తవానికి అంతఃపుర దాసీలకూ, నాకూ తేడా ఏమీ లేదు. రాజుగారి కష్టాలలోనే తప్ప సుఖాలలో భాగం లేని రాణి, ఎలాటి రాణి అనిపించుకుంటుందో, పండితామాత్యులైన మీరే చెప్పండి?" అంటూ రాణి, మార్గంలో గ్రామస్థులిచ్చిన ఆహారం తన భర్త తన వంతు తనకు పెట్టకుండా ఏ విధంగా తినేసిందీ చెప్పింది.

"ఇప్పుడైనా, నా భర్త నేను సుఖపడుతున్నానో లేదో విచారించడు. నేను మంచి భోజనం చేస్తున్నానా, మంచి బట్ట కడుతున్నానా అన్న ఆదుర్దా కూడా

ఆయనకు లేదు," అని రాణి కంట నీరు పెట్టుకున్నది.

"అమ్మా, చింతించకు. ఈ విషయం నీ నోట తెలుసుకునేందుకే, వచ్చాను. రేపు నిండు సభలో నిన్ను నేను యిప్పు డడిగిన మాటలే అడుగుతాను. నువ్వే మాత్రం జంకక యివే సమాధానాలు చెప్పావంటే, నీకీ విచారం లేకుండా నేను చూస్తాను," అన్నాడు బోధిసత్వుడు.

మర్నాటి సభకు రాణీ కూడా వచ్చింది. ఆమెను చూసి బోధిసత్వుడు, "రాణీ గారు రాజ్యానికి వచ్చాక భృత్యుల విషయం పట్టించుకోవడమే లేదు," అన్నాడు.

రాణి పూర్వం బోధిసత్వుడికి చెప్పిన విషయాలన్నీ సభలో చెప్పేసింది. తాను ఆమె వంతు భోజనం దొంగతనంగా తిన్న మాట ఆమె బయట పెట్టేసరికి, రాజుకు సభికులలో తీరని తలవంపులయింది.

రాణి మాట్లాడడం పూర్తి కాగానే బోధిసత్వుడు, "రాజుగారికి నీ పట్ల ఆదరం లేనప్పుడు, నువ్వాయనను అంటి పెట్టుకుని ఉండడం అనవసరం.

చజే చజంతం, వణ్ణం న కయిరా;
అపేత చిత్తేన న సంభజేయ్య;
ద్విజో దుమం ఖీణ ఫలంతి ఞత్వా;
అంఞం సమేక్షేయ్య, మహాహి లోకే.

(విడిచినవాణ్ణి విడిచిపుచ్చు, అలాటి వాడి స్నేహం ఆశించకు; అపేక్ష లేనివాడి పట్ల ఆదరభావం చూపకు. పక్షి ఫలాలు లేని చెట్టును విడిచి యితర చెట్లు చూచు కుంటుంది. లోకం సువిశాలమైనది.)

అందుచేత నువ్వు, యీ రాజభవనం విడిచి విశాల ప్రపంచంలోకి పోయి, ఆదరం లభించే చోట సుఖజీవనం గడ పడం మంచిది," అన్నాడు.

వెంటనే రాజు సింహాసనం నుంచి దిగి వచ్చి, బోధిసత్వుడి కాళ్ళపైబడి, "పండితామాత్యా, నా తప్పు క్షమించండి! ఇక ముందు నా భార్య పట్ల ధర్మంగా ప్రవర్తిస్తాను," అన్నాడు. ఆనాటి నుంచి రాజు రాణిని ఆదరంతో చూడసాగాడు.






# పృథ్వీరాజు – సంయుక్త-1

పదకొండవ శతాబ్దంలో, ఉత్తర భారత దేశాన్ని నాలుగు ముఖ్యమైన హిందూ రాజకుటుంబాలు పరిపాలిస్తూండేవి. రాజధానీ నగరాలైన ఢిల్లీ, గుజరాత్, అజ్మీర్, కనూజ్ సాంస్కృతిక, వ్యాపార రంగాల్లో ఉచ్ఛస్థితినందుకున్నవి.

ప్రతిభావంతుడైన యువకుడు పృథ్వీరాజు ఢిల్లీ పాలకుడు. అజ్మీర్ రాజు ఆయన మాతామహుడు. ఆయనకు పిల్లలు లేరు. తన రాజ్యానికి పృథ్వీరాజును వారసుణ్ణి చేస్తూ, మరణ సమయంలో అతణ్ణి ఆశీర్వదించాడు.





కనూజ్ రాజు జయచంద్రుడు ఆయన సోదరి భర్త. అతడికి అజ్మీర్ రాజ్యాన్ని తనది చేసుకోవాలన్న ఆశ వున్నది. కాని, పృథ్వీరాజు మహావీరుడన్న సంగతి తెలిసినవాడు కావడంతో, జంకి వూరుకున్నాడు.



గొప్ప ఆనందోత్సాహాలతో పృథ్వీరాజుకు పట్టాభిషేకం జరిగింది. ఇప్పుడతడు విశాలమైన ఢిల్లీ, అజ్మీర్‌లకు రాజు. సమర్థవంతంగా రాజ్యపాలన చేయ సాగాడు.

ఆఫ్ఘనిస్థాన్‌లోని గోరీప్రాంతపు పాలకుడైన గోరీమహ్మద్ ఢిల్లీని వశపరచుకోవాలనే కాంక్ష గలవాడు. అతడు ఆరుసార్లు ఢిల్లీపై దండెత్తివచ్చి, ప్రతిసారీ పృథ్వీరాజు చేతిలో చిత్తుగా ఓడిపోయాడు. గోరీని ఎదిరించేందుకు జయచంద్రుడు తప్ప, మిగిలిన రాజపుత్ర రాజులు పృథ్వీరాజుకు సాయపడ్డారు.





ఒకసారి గోరీమహ్మద్ ఖైదీగా దొరికినప్పుడు, పృథ్వీరాజు సైనికనాయకుల్లో కొందరు అతణ్ణి ఆడవేషంలో మేనా మీద తిప్పిపంపాలనుకున్నారు. ఈ విధంగా గోరీమహ్మద్ చాలా అవమానం పాలయాడు.

పృథ్వీరాజు అతణ్ణి విడిపించి, తిరిగి ఏనాడూ యిలాంటి దాడులు చేయ వద్దని గట్టిగా హెచ్చరించాడు. చంప దగిన శత్రువైనా, కరుణించి విడిచినం దుకు గోరీ, పృథ్వీరాజుకు తన కృతజ్ఞత తెలియబరిచాడు.





కనూజ్ రాజు జయచంద్రుడికి సంయుక్త అనే కుమార్తె వున్నది. ఆమె గొప్ప సౌందర్యవతే గాక, విద్యా వంతురాలు. ఈ కారణాలవల్ల దేశంలో ఆమెను గురించి తెలియని రాజ కుటుంబం లేదు.

జయచంద్రుడు ఆమెకు స్వయంవరం ప్రకటించాడు. అతడు పృథ్వీరాజుకు తప్ప, వివాహ యోగ్యులైన అనేక మంది రాజకుమారులకు ఆహ్వానాలు పంపాడు. చాలాకాలం కిందట పృథ్వీ రాజు ఒకసారి సంయుక్తను అజ్మీర్ రాజసౌధంలో చూశాడు. అతడామెను మరిచిపోలేదు.





సంయుక్త స్వయంవరానికి అన్ని ఏర్పాట్లూ పూర్తి అయిన తరుణంలో, హఠాత్తుగా సరిహద్దు ప్రాంతాల యుద్ధ ప్రమాదం సంభవించింది. కొందరు రాకుమారుల అభ్యర్థనమేరకు జయచంద్రుడు కుమార్తె స్వయంవరాన్ని, అప్పటికి విరమించాడు. ఆ సంగతి నగరవాసులకు దండోరా ద్వారా, ఆహ్వానితులకు వార్తాహరుల ద్వారా తెలియపరచబడింది.

తనను స్వయంవరానికి ఆహ్వానించనందుకు, జయచంద్రుడిపై పృథ్వీరాజుకు చాలా కోపం కలిగింది. అతడు తన ముసలిదాదితో సంయుక్త పట్ల తనకు గల ప్రేమ గురించి చెప్పాడు.





దాది సంయుక్తకు, పృథ్వీరాజు మీద ఆదరభావం కలిగేందుకు సహాయపడ గలనని మాట యిచ్చింది. ఆ సమయంలో వర్తకుల బిడారు ఒకటి అజ్మీర్‌కు ప్రయాణమవుతున్నది. ముసలి దాది ఆ బిడారు వెంట బయలుదేరింది. — (ఇంకా వుంది)



# పెద్దవాళ్ళతో పని

చంద్రయ్యకు పాతికేళ్ళ వయసులో తండ్రి చనిపోయాడు. ఆయన కొడుకుకు వదిలిపోయిన ఆస్తి, రెండెకరాల పొలం, ఇల్లూ, ముప్ఫైవేల రూపాయిల నగదూ. ఇంత డబ్బు దగ్గిర వుంచుకుంటే అనవసరంగా ఖర్చయిపోతుందని ఆలోచించి, దాన్ని వడ్డీవ్యాపారంలో పెట్టాలనుకున్నాడు, చంద్రయ్య.

ఈ సంగతి అతడు మిత్రులతో చెప్పగానే, ఊళ్లో పేరుమోసిన గంగయ్య అనే వైద్యుడు కబురు పెట్టి, ''చంద్రయ్యా, యీ పాత ఇల్లు వచ్చేపోయే రోగులకు సరిపోవడం లేదు. కొత్తగా వైద్యశాల కడదామనుకుంటున్నాను. నాకు పదివేల రూపాయిలు అప్పుగా యిచ్చావంటే నెల నెలా వడ్డీ యిచ్చుకుంటాను. సొమ్ము జతపడగానే, మొత్తం బాకీ తీర్చేస్తాను,'' అన్నాడు.

వైద్యుడుగా గంగయ్యకు మంచి రాబడి వున్నది గనక, తన డబ్బుకు మంచి భద్రత వుంటుందనుకుని చంద్రయ్య, అతడికి పదివేల రూపాయిలు యిచ్చి, పత్రం రాయించుకున్నాడు.

ఇది జరిగిన పది రోజుల తరవాత ఊరి పెద్దమనుషుల్లో ఒకడూ, మంచి వ్యవహర్తా అయిన సోమనాథం, చంద్రయ్య కోసం మనిషిని పంపి, ''చంద్రయ్యా, నా కున్న పరపతి సంగతి నువ్వెరిగిందే! ఆ మధ్య మా అమ్మాయి పెళ్ళి జరిపాక, డబ్బుకు కాస్త యిబ్బందిగా వున్నది. ఒక్క ఐదువేల రూపాయిలు అప్పుగా యిచ్చావంటే ప్రతి నెలా వడ్డీ యిస్తూ, అసలు త్వరలోనే సర్దేస్తాను,'' అన్నాడు.

చంద్రయ్య, అతడికి అడిగిన మొత్తం యిచ్చి పత్రం రాయించుకున్నాడు.

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

ఆ తరవాత వారం తిరక్కుండానే మోతుబరిరైతు మారయ్య స్వయంగా చంద్రయ్య యింటికి వచ్చి, ''చంద్రయ్యా, ఇంత భూస్వామి అప్పుకోసం రావడమేమిటా అని ఆశ్చర్యపడకు. కొత్తగా మరి కొంత పొలం కొనబోతున్నాను. ఐదు వేలంటే, ఐదువేలు తగ్గినై. ఆ మొత్తం సర్దుబాటు చేశావంటే, నెలనెలా వడ్డీ పంపుతూ, తీసుకున్న డబ్బు పువ్వుల్లో పెట్టి, స్వయంగా తెచ్చి యిస్తాను,'' అన్నాడు.

చంద్రయ్య అతడికీ డబ్బిచ్చి పత్రం రాయించుకున్నాడు. ఆరు నెలలు గడిచినై. వైద్యుడూ, ఊరి పెద్దా, మోతుబరి రైతూ నెల నెలా వడ్డీ యిస్తూంటే, చంద్రయ్య తనకు వడ్డీ వ్యాపారం చెయ్యాలనే ఆలోచన రావడం గొప్ప అదృష్టంగా భావించాడు.

మరొక ఆరు నెలలు జరిగేసరికి బాకీదార్లు ముగ్గురూ నెల నెలా వడ్డీ కట్టక పోగా, రెండు మూడు నెలల కొకసారి ఒక నెల వడ్డీ మాత్రం పంపడం ప్రారంభించారు.

ఇప్పుడు చంద్రయ్య దగ్గిర తండ్రి యిచ్చిపోయిన డబ్బులో పదివేలు మిగిలి వున్నది. ఆసరికి వడ్డీ వ్యాపారంలో వున్న చిక్కులు గ్రహించి అతడు, అందులో ఐదువేలు పెట్టి, రెండెకరాల మెట్టభూమి కొన్నాడు. దాని వ్యవసాయపు పనులకు మూడు వేలు పెట్టుబడి పెట్టవలసి



వచ్చింది. ఇచ్చిన అప్పులకు వడ్డీ డబ్బు సరిగా రాకపోవడంతో అతడు ఇంటి ఖర్చులకుగాను మిగిలిన రెండు వేలలో, వెయ్యి రూపాయిలు ఖర్చు చేయవలసి వచ్చింది. ఇక తనదంటూ రొఖ్ఖంగా మిగిలింది వెయ్యి రూపాయిలు!

ఈ పరిస్థితి చూసి చంద్రయ్య బెంగ పడిపోయి అప్పు తీసుకున్న వాళ్ళను కలుసుకుని, నెలనెలా వడ్డీడబ్బు యివ్వక పోతేమానె, అప్పుగా తీసుకున్న మొత్తమైనా యివ్వమని ప్రాధేయపడ్డాడు.

''ఎలాగూ, ఇంట్లో వున్న బంగారం అమ్మేయాలనుకుంటున్నాను. నీ బాకీ త్వరలోనే తీర్చేస్తాను,'' అన్నాడు వైద్యుడు గంగయ్య.

''రామాపురంలో మా తాతలనాటి ఇల్లు బేరం పెట్టాను. అది అమ్ముడవగానే, నీ డబ్బు పూర్తిగా యిచ్చేస్తాను,'' అన్నాడు ఊరి పెద్ద సోమనాథం.

''దూరంగా వున్న కోడూరుపొలం అమ్మబోతున్నాను. వడ్డీతో సహా, నీ బాకీ చెల్లువేస్తాను,'' అన్నాడు మోతుబరిరైతు మారయ్య.

నెల రోజులు గడిచినా, ఆ ముగ్గురి నుంచీ వడ్డీ డబ్బు కూడా రాకపోవడంతో, చంద్రయ్య సంగతి ఊళ్లో నలుగురికీ చెప్పి, సాయపడమన్నాడు.

వాళ్ళల్లో కొందరికి వైద్యుడితో మొహమాటాలున్నవి. మరి కొందరికి ఊరి పెద్దతో యింకా తెగని లావాదేవీలున్నవి.



మిగిలిన వాళ్ళకు మోతుబరిరైతంటే తగని భయం.

వాళ్ళు చంద్రయ్యతో, "పెద్దవాళ్ళతోటి వ్యవహారాలు యిలాగే వుంటవి. ఏం చెయ్యగలం!" అన్నారు.

ఇది జరిగిన వారం రోజుల తరవాత, ఒకనాటి ఉదయం చంద్రయ్య భార్యా, ముసలితల్లీ గడపలో కూర్చుని దుఃఖపడుతూండడం చూసి, చాలామంది పోగయారు. వాళ్ళల్లో ఒకడు చంద్రయ్య భార్య చేతిలో వున్న కాయితం తీసుకుని చదివి చూశాడు. అందులో యిలా వున్నది: నేను ఫలాని ఫలాని వారికి వడ్డీ కోసం ఆశించి, పెద్ద మొత్తాలు అప్పుగా యిచ్చాను. వడ్డీమాట దేవుడెరుగు, అసలు కూడా వాళ్ళు యిచ్చేలా లేరు. నా దగ్గిరున్న కొద్ది పెట్టుబడితో సొంత వ్యవసాయప్పనులు సాగక, మనసు చీకాకై సన్యాసుల్లో కలిసిపోతున్నాను.

చంద్రయ్య భార్యా బిడ్డల్ని విడిచి, సన్యాసుల్లో కలిసి పోవడానికి కారణం, అక్కడ గుమిగూడిన నలుగురికీ తెలియగానే వాళ్ళు వైద్యుణ్ణీ, ఊరి పెద్దనూ, మోతుబరి రైతునూ నానాతిట్లూ తిట్టసాగారు.

క్షణాల మీద యీ సంగతి వాళ్ళ ముగ్గురికీ తెలిసిపోయింది. ఊళ్ళో తమ పరువు ప్రతిష్ఠలు కాపాడుకునేందుకు వాళ్లు ఆ సాయంత్రమే చంద్రయ్య ఇంటికి వచ్చి, వడ్డీతోసహా అసలు బాకీ మొత్తం చెల్లించి, పత్రాలు తీసుకుపోయారు.

మరొక వారం గడవకుండానే చంద్రయ్య చిన్న గడ్డంతో, మాసిన బట్టలతో ఇంటికి తిరిగి వచ్చి, తాను సన్యాసుల్లో కలిసినందుకు కోప్పడే ఊరివాళ్ళతో, 'మరేం చేసేది? నేను సన్యాసుల్లో కలిశాక గాని, దేవుడు మన ఊరి పెద్దలకు తీసుకున్న బాకీ చెల్లించాలన్న మంచి బుద్ధి కలిగించకపోయె! ఏమైతేనేం, నేను తిరిగి సంసారినయ్యాను," అంటూ చిన్నగా నవ్వాడు.



# రాజుగారి సమాధానం

విమలు డనే సేనానాయకుడు, తన కుమారుడికీ, అల్లుడికీ రాజుగారితో చెప్పి, కొలువులో ఉద్యోగాలు వేయించుకున్నాడు. ఒకే కుటుంబం వారికిద్దరికి రాజుగారు యిలా ఉద్యోగాలివ్వడం బావు లేదని చాటుగా కొందరు విమర్శించారు.

ఈ సంగతి రాజుగారికి తెలిసింది.

కొన్నాళ్ళ తరవాత విమలుడు మరొక యువకుణ్ణి రాజుగారి దగ్గిరకు తీసుకుపోయి, "ప్రభూ, ఆనందు డనే వీడు నా మేనల్లుడు. వీడి ముత్తాత అవంతీ యుద్ధంలో, తాత కళింగ యుద్ధంలో, తండ్రి మహారాష్ట్ర యుద్ధంలో; వరసగా తమ ముత్తాత, తాత, తండ్రిగార్ల దగ్గిర సేవలు చేసి తరించారు. తమ తరంలో కూడా...." అంటూ నసిగాడు.

విషయం అర్థం చేసుకున్న రాజు తాపీగా, "ఈ కుర్రవాడి వంశస్థులు మూడు తరాలుగా, మాకు సేవలు చేసి తరించారన్న సంగతి విని, నాకు చాలా సంతోషంగా వుంది. ఈ తరించే అవకాశం నా తరంలో అయినా కొత్తవాళ్ళకివ్వడం న్యాయంగా వుంటుంది కదా!" అన్నాడు.

ఈ విధంగా తన ఆటకట్టడంతో, విమలుడు మరేనాడూ తన వారిని, రాజుగారి దగ్గరకు ఉద్యోగాల కోసం తీసుకుపోలేదు.

— ఎమ్. డి. సౌజన్య.





# ఉచిత సలహాలు

భూపతి అనే ధనికుడొకాయన, పక్క గ్రామం సిరిపురంలో పదెకరాల బీడు భూమి కొన్నాడు. తనకు స్వగ్రామంలో తీరని పొలం పనులు వుండడంతో కొడుకు రమాపతికి, ఆ బీడును సాగులోకి తెచ్చే పని అప్పగించదలిచాడు.

ఆయన కొడుకుకు సంగతి చెప్పి, "ఈ పని నీకు కొత్త అనుకో, అయినా ఫరవాలేదు. సిరిపురంలో మన దూరపు బంధువు నాంచారయ్య అనే ఆయన వున్నాడు. అవసరపడితే ఆయన్ని సలహా అడుగు," అన్నాడు.

రమాపతి సిరిపురం వెళ్ళి, బీడుభూమి చూశాడు. దాని నిండా తుప్పలూ, ముళ్ళ పొదలూ వున్నవి. వాటిని కొట్టించడానికి ఎందరు కూలీలు అవసరం అని అతడు ఆలోచిస్తున్నంతలో, గ్రామస్థుడొకడు అక్కడికి వచ్చాడు.

ఆ బీడు రమాపతిదని తెలుసుకున్న గ్రామస్థుడు, "అయ్యా, నా పేరు రాజయ్య. ఈ గ్రామంలో ఇటుకలు తయారు చేసి అమ్ముతూంటాను. మీకు అభ్యంతరం లేకపోతే, బీడులో వున్న తుప్పలూ, పొదలూ కొట్టించుకుపోయి, ఇటుకలు కాల్చుకునేందుకు ఉపయోగించుకుంటాను. ఈ విధంగా మీకు బీడు శుభ్రం చేయించే కూలీ ఖర్చు తప్పుతుంది," అన్నాడు.

రమాపతి, రాజయ్యను మర్నాడు వచ్చి కలుసుకోమన్నాడు.

ఆ సాయంత్రం రమాపతి చెప్పింది విన్న నాంచారయ్య, "కుర్రవాడివైనా తొందరపడి, ఆ ఇటుకల రాజయ్యకు మాట యివ్వనందుకు సంతోషంగా వున్నది. ఇక్కడ యీ ఇటుకల వ్యాపారం చేసేవాళ్ళు చాలామంది వున్నారు.

గుంటక సాంబిరెడ్డి

కట్టెలకు మహా గిరాకీ అనుకో! నువు ముందు కూలీలను పెట్టి తుప్పలూ, పొదలూ నరికించు. అవి ఎండాక చాలా లాభసాటిగా అమ్ముకోవచ్చు." అని సలహా యిచ్చాడు.

రమాపతి కూలీలను పెట్టి తుప్పలూ, ముళ్ళపొదలూ నరికించి ఒక చోట పోగు పెట్టించాడు. అవి కొద్ది రోజుల్లోనే బాగా ఎండినై. కాని, వాటికోసం వచ్చిన ఇటుకల వ్యాపారస్థులెవరూ రమాపతికి అతడు కూలికింద ఖర్చు చేసినదానికి మించి ఒక పైసా కూడా ఎక్కువ యివ్వడానికి ఒప్పుకోలేదు.




"ఈ చుట్టుపక్కల అంతా కొండ ప్రదేశం కదా. కూలివాళ్ళను పిలుచుకు వచ్చే శ్రమపడగలిగితే కట్టెలకు కొదవేం వుండదు. ఆ పని మీరు చేయించారు కనక, అయిన కూలీ డబ్బు యిస్తామంటున్నాం," అన్నారు ఇటుకల వర్తకులు.

ఇప్పుడేం చేయడమా అని రమాపతి ఆలోచిస్తున్నంతలో వారం, పది రోజులు గడిచి, తొలకరివానలు ప్రారంభమయాయి. నరికి బీడులో ఒక పక్కగా కుప్ప వేయించిన కంప అంతా పూర్తిగా తడిసిపోయింది. రమాపతి వాటిని దూరంగా పారవేయించేందుకు బాడుగ బండ్లవాళ్ళను అడిగితే, వంద రూపాయిలివ్వమన్నారు.

ఈ సంగతి తెలిసి నాంచారయ్య బళ్ళవాళ్ళను గట్టిగా కోప్పడి రమాపతితో, "నా సలహా ప్రకారం చెయ్యి. ఈ బళ్ళవాళ్ళందరూ ఆశబోతు వెధవలు. నాకు తెలిసిన వేరే బండివాడొకడున్నాడు; వాడు కాస్త తాగుబోతు అంతే! ఒక్క పది రూపాయిలు వాడి చేతిలో పెడితే, యీ చెత్తాచెదారం అంతా దూరంగా పారేస్తాడు," అన్నాడు.

రమాపతి ఆ బండివాడికి పది రూపాయిలిచ్చి, వారంరోజుల్లో వస్తానని నాంచారయ్యకు చెప్పి, స్వగ్రామం వెళ్ళాడు.

వారం తరవాత రమాపతి తిరిగి రాగానే గ్రామ మునసబు నుంచి అతడికి కబురు వచ్చింది. రమాపతి వెళ్ళాడు. మునసబు అతడికి మర్యాద చేసి కూర్చో బెట్టి, ''నాయనా రమాపతీ, నువ్వు చేయించిన పనేం బాగా లేదు. నీ బీడులోని తుప్పలూ, పొదలూ నరికించి పక్క వాగులో పారవేయించావు. మొన్నటి వర్షాలకు అవి కొట్టుకు వచ్చి, చెరువు తూముల ముందు మేట వేశాయి. అవి తీయించి వేయడానికి నూరు రూపాయలు ఖర్చయింది. ఆ మొత్తం నువ్వు వెంటనే చెల్లించాలి. నీ తండ్రి నాకు బాగా తెలిసిన వాడు గనక, అపరాధం కింద మరి కొంత డబ్బు వసూలు చెయ్యకుండా వదిలి పెడుతున్నాను,'' అన్నాడు.

జరిగిందేమిటో రమాపతికి అర్థమైంది. తాగుబోతు బండివాడు ఆ కంప అంతా తీసుకుపోయి దగ్గిరలో వున్న వాగులో పారవేశాడు. ఇదంతా నాంచారయ్య ఉచిత సలహా వినడం వల్ల జరిగింది!

రమాపతి మునసబుకు క్షమాపణ చెప్పుకుని నూరు రూపాయిలూ చెల్లించాడు. ఈ సంగతి విన్న నాంచారయ్య వెతుక్కుంటూ బీడు దగ్గిరున్న రమాపతి దగ్గిరకు వచ్చి, ''మునసబు నీకు వంద రూపాయిలు జరిమానా వేస్తాడా! ఇది పెద్ద దురన్యాయం. అతడికి నేనంటే గిట్టదు. నువ్వు, నాకు బంధువువని తెలిసి, యీ వెధవపని చేశాడు. పట్నం పోయి న్యాయస్థానంలో యితగాడి మీద ఫిర్యాదు చేద్దాం,'' అంటూ సలహా యిచ్చాడు.

రమాపతి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, ''మీ ఉచిత సలహాలకు ఒక్క నమస్కారం! నా చేతనైనట్టుగా, నా పనులు నన్ను చేసుకోనివ్వండి,'' అన్నాడు.

నాంచారయ్య మారు మాట్టాడకుండా ఇంటి దారి పట్టాడు. తాను దమ్మిడీ ప్రతిఫలం తీసుకోకుండా, ఉచితంగా సలహాలివ్వడం వల్లనే, రమాపతి దృష్టిలో వాటికి విలువ లేకుండా పోయిందన్న అనుమానం అతడికి కలిగింది.



# సేవకుడి తెలివి

రత్నగిరి, ధవళగిరి ఇరుగుపొరుగు రాజ్యాలు. ఒకసారి హఠాత్తుగా ధవళగిరి రాజైన శూర వర్ధనుడు రత్నగిరిపై దండెత్తాడు. ధవళగిరి కున్నంత సైనికబలం రత్నగిరికి లేదు. రత్నగిరి రాజైన కీర్తివర్ధనుడు సంధిప్రయత్నాలు ప్రారంభించాడు.

శూరవర్ధనుడు అందుకు ఒప్పుకొని, సంధిషరతులు కుదుర్చుకొనేటందుకు రత్నగిరికి వచ్చాడు. అంతఃపురంలో రాజులు ఇద్దరూ సమావేశమయారు.

ఆ సమయంలో సేవకుడొకడు తాగేందుకు చల్లని పానీయాలు తెచ్చాడు. అక్కడ వాడి కొక సమస్య ఎదురయింది.

పానీయాన్ని ముందుగా తమ రాజైన కీర్తివర్ధనుడి కిస్తే, తనను అలక్ష్యం చేశారని శూర వర్ధనుడికి కోపం రావచ్చు! అలాగాక పానీయాన్ని ముందుగా శూరవర్ధనుడికే ఇస్తే, తన సేవకుడే తనను తక్కువ చేశాడని కీర్తివర్ధనుడికి బాధ కలగవచ్చు!

సేవకుడు ఒక తెలివైన ఆలోచన చేశాడు. పానీయాన్ని ముందుగా కీర్తివర్ధనుడి కిస్తూ, "ప్రభూ! మహారాజు శూరవర్ధనుల వారికి తమరు స్వయంగా దీన్ని యివ్వ ప్రార్థన. అతిథులుగా వచ్చిన రాజులకు సేవకుల ద్వారా గాక, తమరే స్వయంగా అతిథి మర్యాదలు చేయడం, తమ వంశానికి అనాదిగా వస్తున్న ఆచారమే కద!" అన్నాడు.

సేవకుడి మాటలకు ఇద్దరు రాజులూ సంతృప్తి పడ్డారు. చిక్కుసమస్య విడిపోయింది!

— షంషేర్ ఖాన్





# పరోక్షవైరం

ఒక ఊరిలో కట్టెలమ్ముకుని జీవించే కష్ట జీవి ఒకడు ఉండేవాడు. వాడు అందరి కంటె పెందలకడనే లేవటం, అడవికి పోవటం, కట్టెలుకొట్టి మోపుకట్టి తేవటం, అవి అమ్ముకొని పొట్టపోసుకోవటం - ఇదీ నిత్యకృత్యం.

ఫలానావాడు నమ్మకస్థుడు, న్యాయమైన ధర తీసుకుని ఎండు కట్టెలు పట్టుకొచ్చి వేస్తాడు. నిజంగా, కట్టెలు కావాలంటే వాడివద్దనే వేయించుకోవాలి, అని చెప్పి అందరూ వాణ్ణి గురించి ఎంతగానో మెచ్చుకునేవాళ్ళు. వాడి దుస్థితికి జాలిపడేవాళ్ళు కూడాను. వాడు కలిగినదానితో తృప్తిపడేవాడే కాని, కానికూటికి ఎన్నడూ ఆశించినవాడు కాదు.

వాడు రోజూ అడవికి రాజుగారి కోట ముందునించి వస్తూ పోతూ వుండాలి. అదే దారి. రాజుగారు పై అంతస్తునించి రోజూ వీడిని గమనిస్తూ వుండేవాడు. రాజు ఎంతో దయగలవాడు. పేదలపాలిటి పెన్నిధి అని పేరుపడ్డాడు. అటువంటిది అదేమో కాని, రాజుకు ఈ కట్టెలవాడిని చూచినప్పుడెల్లా చెప్పలేని బాధ కలుగుతూ వుండేది. అయినా వాడి వైపు చూడటం మానలేదు.

ఈ బాధ కొంత కాలానికల్లా క్రమంగా ఒక విధమైన ఆవేదనగా మారింది. కట్టెలవాడొక బద్ధశత్రువుగా కనిపించసాగాడు. చివరకు ఈ వైరం బాగా ముదిరి, వాడిని చంపివేస్తే గాని తనకు కసి తీరదన్నంత క్రోధం ఉబికింది. అప్పుడు రాజు ఆలోచించాడు: "కష్టజీవి ఐనటువంటి ఈ కట్టెలవాడు నా కేమి అపకారం చేశాడు! ఏం చేయగలడు? మరి, వాడిని చూచినంతనే, నా కెందుకింత బాధ కలగాలి?"

ఈ విధంగా తనలో తనే ప్రశ్నించు కొంటూ, కారణం తెలియక మనోవేదనతో కుమిలిపోజొచ్చాడు రాజు.

నిజానికి రాజు అలా కుమిలిపోనవసరం లేనేలేదు. ఈ కోట ముందు నించి వెళ్ళకూడదు అని ఆజ్ఞాపించి వాడు తన కంటబడకుండా నిమిషంలో చేసుకోవచ్చు. కాని, రాజు అలా అధికారం వినియోగించ దలుచుకోలేదు. దీనికి మూలకారణం ఏమిటా అని తెలుసుకోవటానికి ఆయన ఆత్రపడసాగాడు.



ఇంతలో మంత్రి వచ్చి, ప్రభువు విచారంగా వుండటం కనిపెట్టాడు. సంగతి సందర్భాలు తెలియగానే అతనికి చాలా ఆశ్చర్యం వేసింది.

వెంటనే, కట్టెలవాని అంతర్యం తెలుసుకోవటానికని గూఢచారులను నియమించి, తను స్వయంగా వేయి కన్నులతో కనిపెట్టసాగాడు. ఎక్కడికి పోయి ఎంత మందిని అడిగినప్పటికీ కట్టెలవాడిని గురించి మంచిగానే చెబుతూ వచ్చారు. అమాయకుడు, కష్టజీవి, న్యాయశీలుడు, అనే మాటలే కాని, ఒక్కళ్ళ నోటి వెంటనైనా వాడిని గురించి ప్రతికూలమైన వాక్కు ఒక్కటీ వెలువడలేదు.

మంత్రికి ఎన్నాళ్ళకూ ఆచూకీ ఏమీ దొరికింది కాదు. నీ తెలివితేటలింతేనా! అని రాజు అనేస్తాడేమోనని జంకు కలిగింది.

ఆఖరు యత్నంగా అతడు ఒక్క పని చేశాడు. హఠాత్తుగా ఒకనాటి రాత్రి కట్టెలు కొట్టే వాడి యిల్లు సోదా చేదామని తలచి వెళ్ళాడు. వెళ్ళాడే కాని, ఆ పూరి గుడిసెలో ఏమున్నది గనక ?—ధన ధాన్యాలా ? దొంగసొత్తులా, ఏమన్నానా ? ఒక మూల కొన్ని కట్టెలు మాత్రం గుట్టగా పడివున్నై. వాడి వృత్తే యిదికదా ! కనుక, మంత్రికి తప్పు పట్టటానికేమీ కనిపించలేదు

ఏమీ తోచక మంత్రి, తమాషాకోసం, "ఏమిరా అబ్బీ ! ఇవాళ కట్టెలమ్ముడు

కాలేదా, అక్కడ పడివున్నవేం?" అని అడిగాడు.

"అవి అమ్మకానికి కావులెండి!" అంటూ నసిగేశాడు వాడు. మంత్రికి ఆత్రం కలిగి గుట్టదగ్గరగా వెళ్ళాడు. అతడు అలా వెళ్ళి చూడటం ఇష్టం లేనట్టు సూచించాడు కట్టెలవాడు. మంత్రి ఒక కట్టె తీసి చూచి, మళ్ళీ ప్రశ్నించాడు.

ఇక తప్పనిసరి కావడం వల్ల, "అవి మామూలు కట్టెలు కావండి, మంచి గంధపు కట్టెలండి!" అని నిజం చెప్పి వేశాడు కట్టెలవాడు.

"అలా అయితే యింకేమిరా! వట్టి అమాయకుడివి లాగా వున్నావే? ఇవి అమ్ముకుంటే మంచి ధర వస్తుందికదా?" అన్నాడు మంత్రి, వాడి హితవు కోరుతూ.

కట్టెలవాడి మొగం జేవురించింది. మంత్రి పాదాలమీద పడి, "క్షమిస్తానంటే చెబుతా," అన్నాడు.

మంత్రి అభయమిచ్చేసరికి వాడు చెప్ప సాగాడు: "అయ్యా! నా కడుపులో ఉద్దేశం చెప్పివేస్తున్నా. మన్నించండి. మన ప్రభువు కరుణాసింధువు. పేద వాళ్ళందరకూ ఆయనంటే ప్రాణం. నేనూ ప్రభువుకు జోహారు చేస్తా. ఐతేనేం— నన్నుపట్టి పీడిస్తూవున్న దారిద్ర్య బాధవల్ల నా కొక దుర్బుద్ధి పుట్టింది. ఏలినవారు ముసలివారయ్యారు కదా. ఇంకెంత కాలం జీవించబోతారు? వారు గతించిన రోజున మంచిగంధపు చెక్కలకు గిరాకీ తగులు తుంది. కనుక, గంధపు చెక్కలు జాగ్రత్త చేసినట్టయితే, ఆ రోజున చెప్పిన వెల యిచ్చి తీసుకొంటారు. నాకు పట్టిన దరిద్రం తీరిపోతుంది!" అనేసరికి మంత్రి నిశ్చేష్టుడైనాడు.

రాజుకు ఈ వర్తమానం తెలియగానే కట్టెలవాడి ఆవేదన గుర్తించి, వాడి దరిద్రం తీరేటట్టు కొల్లలుగా ధనమిచ్చి పంపాడు.

తన మనసులో బాధకు కారణం పరోక్షంగా వాడు అనుభవించే ఈ వేదనే ఐవుంటుందని రాజు గ్రహించాడు.






కృష్ణుడి ఆశ్చర్యానికి రుక్మిణి చిరునవ్వుతో, "ఔను, నాథా! ఈ రోజు నాలో ఆనందం పొంగి పొర్లుతున్నది. ఆ కన్యకామణికి మీ మీద ఎంత ఆశ! అమాంతంగా మిమ్మల్ని నిధిని దాచుకున్నట్లు తన గుప్పెట్లో ఉంచుకోవాలన్నంత మమత నాకు కనిపించింది!" అన్నది.

"మరి, నీ సంగతి చెప్పలేదు!" అన్నాడు కృష్ణుడు.

"మీ లోపల ఒక అణువునై ఇమిడి ఉండిపోవడమే నాకు కావలసిందల్లా! మీరు ఎవరి గుప్పెట్లో ఉన్నా నేను మీలోనే ఉంటానుగదా!" అన్నది రుక్మిణి.

"రుక్మిణీ! ఎంతో గొప్ప భావాల్ని ఎంత సూక్ష్మతి సూక్ష్మంగా నిర్వచించావు! అందుకే నిన్ను కోరికోరి ఎత్తుకు వచ్చాను!" అన్నాడు కృష్ణుడు.

"నాకు నిజమని తోచింది చెబుతున్నాను. నా కంటే సత్యభామదే గొప్ప మమత, బలమైనది! ఆ మమతలో, అనంతమైన ప్రకృతిశక్తి అంతా ఉంది. స్వామీ! నాలో ఉన్నది భక్తిప్రధానమైనది మాత్రమే!" అని చెబుతున్న రుక్మిణిని వారించి, కృష్ణుడు చిరునవ్వు చిందిస్తూ, "రుక్మిణీ, వేదాంతం మాట్లాడకు!" అన్నాడు.

కొద్ది దినాలు గడిచాయో లేదో, "కృష్ణుడు శమంతకమణిని అపహరించాడు!" అనే వార్త కార్చిచ్చులా అంతటా వ్యాపించింది. ఆ విధంగా అందరితో చెప్పి




సత్రాజిత్తే మణిని పోగొట్టుకున్న దుఃఖంతో పిచ్చివాడై వీధివీధులా తిరిగి అరుస్తూ విశేష ప్రచారం చేశాడు.

తన మీద మోపబడ్డ అభాండానికి చింతించి ప్రయోజనం లేదని కృష్ణుడు దిటవు తెచ్చుకొని, ''విఘ్నేశ్వరా! ఇదంతా నీ లీల, తరువాత నీ దయ!'' అని ధ్యానించి, మణిని అన్వేషించడానికి అరణ్యాల్లోకి వెళ్ళాడు.

జరిగినదేమంటే: సత్యభామను సత్రాజిత్తు వరుసకు తనకు మేనల్లుడైన శతధన్వుడనే రాజుకిచ్చి వివాహం చేసే నిర్ణయానికొచ్చి, తన తమ్ముడు ప్రసేనజిత్తును, శతధన్వుడితో మాటామంతీ చేసి రమ్మని పంపాడు. ప్రసేనుడు శ్యమంతక మణిని ధరించి అరణ్య మార్గంలో వెళ్తూండగా, ఒక సింహం మణి చేత ఆకర్షింపబడి అతణ్ణి చంపింది. ఆ సింహాన్ని జాంబవంతుడు చంపి, మణిని తీసుకుపోయి, తన కుమార్తె జాంబవతికి యిచ్చాడు.

మణిని ధరించి వెళ్ళిన తమ్ముడు తిరిగి రాకపోవడంతో, ఒకప్పుడు మణిని అడిగిన కారణంగా కృష్ణుడే తన తమ్ముణ్ణి సంహరించి మణిని అపహరించాడని సత్రాజిత్తు చాటాడు. సత్యభామను పెళ్లాడ్డానికి ఉవ్విళ్ళూరుతున్న శతధన్వుడు, జరాసంధుడు మొదలైన కృష్ణుడి శత్రువులైన రాజులు సత్రాజిత్తును బలపరిచి పగ తీర్చుకోడానికి సాయపడతామంటూ కబురు పెట్టారు.

మణిని అన్వేషిస్తూ వెళ్ళిన కృష్ణుడు, అరణ్యంలో ఒకచోట చచ్చిపడి ఉన్న ప్రసేనుడినీ, సింహాన్నీ, జాంబవంతుడి అడుగుజాడలనూ చూసి జాంబవంతుడి గుహకు వెళ్ళాడు.

గుహలో నవ యవ్వనవతి, సుందరి అయిన జాంబవతి మణిని బంతిలాగ ఎగరవేసి పట్టుకొంటూ ఆడుకొంటున్నది. జాంబవతి పసిపిల్లగా అరణ్యంలో జాంబవంతుడికి దొరికిన అనాథ రాజపుత్రిక.

అతడామెను తన ముద్దుల కూతురుగా పెంచుకొచ్చాడు.

మణిని తీసుకొనడానికి కృష్ణుడు ఆమె చేతిని పట్టుకొన్నాడు. జాంబవతి చేతిని విడిపించుకోవడానికి ప్రయత్నించకుండా తల వాల్చి సిగ్గుదొంతరలతో క్రీగంట కృష్ణుణ్ణి చూస్తున్న సమయంలో జాంబవంతుడు గుహకు వచ్చి, కృష్ణుడిపై లంఘించాడు. ఇద్దరికీ పన్నెండు రోజులు గొప్ప యుద్ధం జరిగింది. కృష్ణుడు పిడికిటితో జాంబవంతుడి గుండెమీద బలంగా పొడిచాడు. ఆ పోటుతో రాముడే కృష్ణుడుగా అవతరించాడని జాంబవంతుడు గుర్తించాడు.

జాంబవంతుడు కృష్ణుడికి ప్రణమిల్లి, "కృష్ణా! జాంబవతి చేతిని పట్టనే పట్టావు. జాంబవతి నీదే!" అంటూ శ్యమంతకమణినీ, జాంబవతినీ కృష్ణుడికి సమర్పించాడు.

జాంబవతితో జాంబవంతుడు వెంట రాగా కృష్ణుడు మణితో ద్వారకకు వచ్చి, సత్రాజిత్తుకు మణిని అందజేశాడు. జాంబవంతుడు సత్రాజిత్తుకు జరిగినదంతా చెప్పాడు.

సత్రాజిత్తు పశ్చాత్తాపం పొంది కృష్ణుడితో, "కృష్ణా! సొమ్ము పోయినవాడు పాపాత్ముడు అనే విధంగా నేను మహాపరాధం చేశాను. నన్ను నీ యిష్టమొచ్చినట్లు దండించు!" అన్నాడు.



కృష్ణుడు సత్రాజిత్తుతో, "నీ పశ్చాత్తాపమే నీకు దండన!" అన్నాడు.

అప్పుడు సత్రాజిత్తు తన అపచారానికి పరిహారంగా, మన్ననగా శ్యమంతకమణినీ, సత్యభామనూ కృష్ణుడి ఎదుట ఉంచి స్వీకరించమని వేడుకొన్నాడు.

కృష్ణుడు సత్యభామను స్వీకరిస్తూ, శమంతకమణిని సత్రాజిత్తునే ఉంచుకోమని తిరిగి యిచ్చివేశాడు. అప్పుడు సత్యభామ, కృష్ణుడు తనను స్వీకరించిన ఆనందం పొంగిపొర్లుతుండగా, "చుశావా, నాన్నా! నేను గొప్పదాన్నే, మణి గొప్పదో



సత్రాజిత్తు భక్తితో విఘ్నేశ్వరుడికి మ్రొక్కి, "నా అపచారాన్ని మన్నించు దేవా!" అంటూ లెంపలు వేసుకొన్నాడు.

కృష్ణుడు, "విఘ్నేశా! అంతా నీ లీల, నీ దయవలన అపవాదు తొలగించుకొని మణికంటే అమూల్యమయిన సత్యభామా మణిని సంపాదించాను!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "శ్యమంతకమణి కథ విన్నవారికి అపనిందలు అంటవు," అని చెపుతూ అంతర్ధానమయ్యాడు.

సత్రాజిత్తు కృష్ణుడి కాళ్ళు కడిగి కన్యాదానం చేసే తన అదృష్టానికి పొంగి పోతూ, కృష్ణుడితో సత్యభామ వివాహాన్ని మహా వైభవోపేతంగా జరిపించాడు. తరువాత కృష్ణుడు జాంబవతిని వివాహం చేసుకొన్నాడు. జాంబవంతుడు కృష్ణుడితో, "కృష్ణా! నీవు రామావతారంలో ఉన్నప్పుడు నీతో యుద్ధం చేయాలని అభిలాషను వ్యక్తం చేశాను. నీ వంటి అల్లుడిని పొందిన జనకమహారాజు అదృష్టానికి అసూయ పడుతున్నానని కూడా అన్నాను. ఆ రెండు కోరికలూ యిప్పుడు తీర్చావు. నేను ధన్యుణ్ణి, జీవన్ముక్తుణ్ణి!" అని చెప్పి తపస్సు చేసి తరించడానికి అరణ్యాల్లోకి వెళ్ళిపోయాడు.

కొంతకాలం తరువాత శతధన్వుడు కసితో సత్రాజిత్తును చంపి మణిని తీసు

యిప్పుడు తెలిసిందా!" అన్నట్లు సగర్వంగా సత్రాజిత్తును చూసి, "నాన్నా! ఒకప్పుడు విఘ్నేశ్వరుడి మహత్తును గుర్తించలేనివాడివై ఏమో అన్నావు. నేను విఘ్నేశ్వరుణ్ణే నమ్ముకొన్నదాన్ని. నా అభీష్టం నెరవేరింది!" అంటూ విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి చేతులెత్తి మ్రొక్కింది.

అప్పుడు విఘ్నేశ్వరుడు ఆకాశంలో లీలగా కనిపించి, "భగవంతుడు తనకు అత్యంత ప్రియమైన సత్యానికి ఎల్లప్పుడూ వశవర్తిగా ఉంటాడు. సత్యమే అతని సొత్తు!" అనే అర్థం స్ఫురించేలాగ, "సత్యభామా పరిణయంతో కృష్ణుడు సత్యాపతిగా పేరు పడతాడు!" అని చెప్పాడు.

కుని కృతవర్మ, అక్రూరులు తోడుగా పారిపోయాడు. కృష్ణుడు సత్యభామను ఓదార్చి శతధన్వుడిని యుద్ధంలో సంహరించాడు. అక్రూర కృతవర్మలు మణితో పారిపోయారు. వారిని వెదకిపట్టి కృష్ణుడు మణిని తీసుకొచ్చి, తండ్రి జ్ఞాపకచిహ్నంగా ఉంచుకోమని సత్యభామకు ఇచ్చాడు.

కృష్ణుడు మిత్రవింద, కాళింది, భద్ర, నాగ్నజితి, లక్షణ అనేవారిని కూడా వివాహం చేసుకొన్నాడు. ఎనమండుగురు భార్యలతో కృష్ణుడు భోగభాగ్యాలతో తుల తూగుతూ ప్రతి ఏటా వినాయకచవితిని భక్తిశ్రద్ధలతో జరుపుతూ వచ్చాడు.




శ్యమంతకమణి ప్రభావంవల్ల సత్యభామ అంతఃపురం అంతులేని బంగారంతో నిండిపోయింది. ఆ బంగారంతో సత్యభామ రత్నరాసులనూ, అమూల్యాభరణాలనూ, చీనిచీనాంబరాలనూ కోకొల్లలుగా తన ఇంట నింపుకొంది. అష్టమహిషులలో తానే ఐశ్వర్యవంతురాలననే సంపద్గర్వంతోబాటు, తానే అధికురాలననీ, కృష్ణుడికి ఇష్ట భార్యననే అహంభావం క్రమక్రమంగా పెరిగింది.

కృష్ణుని అష్టమహిషులలో జాంబవతి గొప్ప వైణిక విద్వాంసురాలు. నారదుడు తన మహతివీణను వాయించుతూ గగనమార్గంలో పయనిస్తూండగా పరిహాసం చేస్తూన్నట్టుగా పకపకమంటూ నవ్వు వినిపించింది.

నారదుడు నివ్వెరపోయి, "ఎవరా నవ్వేది? ఎందుకు నవ్వుతున్నావు?" అంటూ నలుదెసలా చూశాడు.

"నారదా! యింకా నీవు చాలా నేర్చుకోవలసి ఉంది. నీ వీణావాదానికి నీవు నీలో పొంగిపోతూంటే నవ్వు వచ్చింది!" అని అశరీరవాణి పలికింది.

నారదుడు, "ఎవరి వద్ద యింకా నేర్చుకోవాలి?" అని అనుకుంటూండగా విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి, "జాంబవతి వద్ద వీణావాద్యంలోని మెళుకువలన్నీ క్షుణ్ణంగా తెలుసుకో!" అని చెప్పాడు.



ఆ విధంగా నారదుడు కృష్ణుడి అనుగ్రహంతో జాంబవతి వల్ల వీణావాదంలోని మెళుకువలన్నీ తెలుసుకున్నాడు.

ఒకనాడు కృష్ణుడు రుక్మిణి అంతఃపురంలో ఉండగా నారదుడు పారిజాత పుష్పాన్ని అతని కిచ్చాడు. కృష్ణుడు దాన్ని రుక్మిణి కిచ్చాడు. అది విని సత్యభామ అలిగింది. కృష్ణుడు సత్యభామను బుజ్జగించి ఆమెతో గరుడ వాహనంపై ఇంద్రుడి స్వర్గానికి వెళ్ళి, నందనవనంలోని పారిజాత వృక్షానికి వృక్షాన్నే తీసుకువచ్చి సత్యభామ ఇంటి పెరట్లో నాటాడు. అయినప్పటికీ కృష్ణుడికి తనపై గురి తగ్గిపోతూన్నదేమోననే దిగులు పట్టుకొన్నది సత్యభామకు. కృష్ణుడిని తన చెప్పుచేతల్లో తన మందిరంలో ఉండిపోయేలాగ చేసుకోవాలన్న తాపత్రయం పెంచుకొన్నది.

నారదుడు ఒకనాడు సత్య ఇంటికి వచ్చి, పుణ్యకవ్రతం ఆచరిస్తే కృష్ణుడు ఆమె అధీనంలోనే ఉంటాడని చెప్పాడు. సత్యభామ వ్రత నియమం ప్రకారం కృష్ణుణ్ణి నారదుడికి దానం చేసింది. నారదుడు కృష్ణుణ్ణి ఎత్తుకెత్తు బంగార మిచ్చి కొనుక్కోవచ్చునని అమ్మకానికి పెట్టాడు. సత్యభామ తన ఇంటనున్న అంతులేని బంగారాన్ని కృష్ణతులాభారంలో పెట్టింది, శ్యమంతకమణిని కూడా వేసింది. కాని కృష్ణుడు కొంచెమైనా తూగలేదు. అప్పుడు సత్యభామ గర్వాన్ని విడిచిపెట్టి, రుక్మిణిని కృష్ణుణ్ణి విడిపించుకొనే మార్గం చెప్పమని వేడింది.

రుక్మిణి, "చెల్లీ! కృష్ణుడితో సరితూగగల సంపద భక్తి ఒక్కటే! భక్తిపూర్వకంగా వేసిన ఒక్క తులసీదళం చాలును!" అని చెప్పి సత్యభామకు చిన్న తులసిఆకు యిచ్చింది.

సత్యభామ ఆ తులసీ దళాన్ని కన్నుల కద్దుకొని, భక్తిపూర్వకంగా తక్కెడలో వేసింది. కృష్ణుడు కూర్చున్న సిబ్బె పైకి లేచి సమానంగా తూగింది. అప్పుడు

నారదుడు తులసిదళాన్ని మాత్రమే తీసుకొని కళ్ళకు అద్దుకొని, కృష్ణుణ్ణి సత్యభామ పరం చేసి వెళ్ళిపోయాడు.

కృష్ణ తులాభారంతో సత్యభామకు జ్ఞానోదయం అయింది. ఐశ్వర్యంమీద, మణిమీద వ్యామోహం నశించి కృష్ణుడే తన పెన్నిధిగా భక్తిభావం కలిగింది.

మణివలన లభించిన బంగారాన్ని అంతటినీ కృష్ణుడు చెప్పినట్లుగా యాత్రికులకూ, బాటసారులకూ భోజన వసతి సౌకర్యాలు గల ధర్మశాలలనేకం, దేశమంతటా తండ్రి స్మృతి చిహ్నాలుగా కట్టించింది. ఆ ధర్మశాలలు సత్రాజిత్తు పేరు స్ఫురించేలాగ సత్రములు అని పిలువబడ్డాయి.

అటు పిమ్మట కొంతకాలానికి కృష్ణ బలరాముల చెల్లెలైన సుభద్రకు అర్జునుడితో వివాహం జరిగినప్పుడు, సత్యభామ శ్యమంతకమణిని సుభద్రకు అరణంగా పెట్టింది. ఆ విధంగా మణి పాండవులను చేరింది.

మణి కూర్చిన బంగారం ధర్మరాజు రాజసూయ యాగం చేయడానికి బాగా ఉపయోగపడింది. తరువాత ధర్మరాజు జూదమాడి తనతో బాటు తమ్ములనూ, ద్రౌపదినీ, రాజ్యాన్ని ఓడిపోయాడు. రాజసూయయాగం చూచి దుర్యోధనుడికి కన్ను కుట్టింది. ద్రౌపదిని పరాభవించాలనే దుశ్చింత రేపింది. పాండవుల పురోహితుడైన ధౌమ్యుడు తొలినుండి అనేక అనర్థాలకు కారణమవుతూ వచ్చిన శ్యమంతక మణిని విసర్జించమని చెప్పగా అర్జునుడు మణిని వింటికి సంధించి బలంగా భూమికేసి కొట్టాడు. మణి భూగర్భంలో నిక్షిప్త పడిపోయింది.

పాండవులు జూదంలో కౌరవులకు ఓడి అరణ్య వాసం చేస్తూండగా, ఒకనాడు నారదుడు వారి వద్దకు వచ్చి, రాజ్య ప్రాప్తికి భక్తిశ్రద్ధలతో విఘ్నేశ్వరుణ్ణి ఆరాధించి గణేశవ్రతాన్ని చేసి, తరవాత అజ్ఞాత వాసానికి వెళ్ళమని చెప్పాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 5

హసన్, అతడి భార్య అయిన గంధర్వ చక్రవర్తి కూతురూ నలభై రోజులు అక్కడ గడిపినాక హసన్‌కు కలలో తల్లి కనిపించి, తనను మరిచిపోయినందుకు అతన్ని చివాట్లు పెట్టింది. అతను పెద్ద పెట్టున మూలుగుతూ, కన్నీరు కారుస్తూ నిద్ర నుంచి లేచాడు. ఏమి జరిగిందోనని అక్కలందరూ గాభరాపడి పరిగెత్తు కొచ్చారు.

హసన్ భార్యకు కూడా అతని దుఃఖానికి కారణం తెలియలేదు.

హసన్ తన కల గురించి చెప్పినాక అతని చిన్నక్క, "ఇక నిన్ను ఇక్కడ ఉండనివ్వటం భావ్యం కాదు. మీ అమ్మ వద్దకు వెళ్ళు! కాని ఏటా వచ్చి మాతో కొంతకాలం వుంటానని మాట ఇయ్యి!" అన్నది.

ప్రయాణ సన్నాహమంతా పూర్తి అయ్యాక వెళ్లటం ఎలాగన్న సమస్య వచ్చింది. బెహ్రాం తాలూకు డప్పు హసన్‌కు జ్ఞాపకం వచ్చింది. ఆ డప్పు ఎలా మోగించాలో అతనికి చిన్నక్క నేర్పింది. దాన్ని మోగించగానే అంతులేని ఒంటెలూ, గుర్రాలూ, కంచరగాడిదలూ దూకుతూ వచ్చి సోల్పుగా నిలబడ్డాయి. వాటిలో ఉత్తమమైన వాటిని అవసరమైన మేరకు ఉంచేసి మిగిలిన వాటిని పంపేసిన మీదట హసన్ తన అక్కలిచ్చిన బహుమానాలన్నీ పుచ్చుకుని, వారికి వీడ్కోలు చెప్పి, తన భార్య అయిన గంధర్వ చక్రవర్తి కుమార్తెతో సహా ఇంటికి బయలుదేరాడు. అతడి ప్రయాణం శరవేగంతో సాగి శీఘ్రంగానే ముగిసింది.



తెలిసి ఆమెకు మతిపోయినట్టయింది. ఇలాటి కోడలికి ఎలాటి మర్యాదలు జరపాలో కూడా ఆమెకు పాలుబోలేదు.

ఆవిడ అప్పుడే బయలుదేరి వెళ్ళి దుకాణాలలో ఉన్న బట్టలలోకెల్లా మేలయినవి పది ఏరి, కొని తెచ్చి, అన్నిటినీ ఒక్కసారే తన కోడలిపైన కప్పింది. తరవాత ఆమె తనకు తెలిసిన గొప్ప వంటకాలన్నీ చేసి స్వయంగా కోడలికి తినిపించింది.

చివరకు ఆమె తన కొడుకుతో, "నాయనా, నీ భార్య ఉండటానికి యీ బస్రానగరం ఎంతమాత్రమూ తగదురా. ఇక్కడ మనం పేదగా బతికిన వాళ్ళం కూడాను. అందుచేత మనం వెంటనే మకాం బాగ్దాదుకు మార్చి, గొప్ప అమీర్లమని చెప్పుకు బతుకుదాం," అన్నది.

ఈ ఆలోచన హసన్‌కు కూడా నచ్చింది. అతను తన ఇంటిని సామానుతో సహా విక్రయం చేసి; తన దగ్గిర ఉన్న డప్పు సహాయంతో బాగ్దాదు చేరాడు. అతను నగరంలోకి వెళ్ళి దళార్ల ద్వారా ఒక దివ్యమైన భవనాన్ని లక్ష దీనారాలిచ్చి కొన్నాడు. ఆ ఇంటికి తగ్గట్టుగా సామగ్రీ, అలంకరణలూ ఏర్పాటు చేసి, అందులో తన భార్యతోనూ, తల్లితోనూ ప్రవేశించాడు. అతను ఎంతమంది దాసదాసీలను

హసన్ బస్రా నగరంలో తన ఇంటి ముందు దిగుతూండగానే లోపలి నుంచి అతని తల్లి చేసే రోదనం వినిపించింది. అతను కూడా కన్నీరు కార్చుతూ తలవాకిలి తలుపు తట్టాడు. హసన్ తల్లి లేచి వచ్చి తలుపు తెరిచి, తన కొడుకును చూస్తూనే పెద్దగా నిట్టూర్చి మూర్ఛపోయింది.

హసన్ తన భార్యతో సహా తల్లికి ఉపచారాలు చేసి శీఘ్రంగానే స్పృహ కలిగించాడు. అతను తన భార్యను ఆమెకు పరిచయం చేశాడు. తన కోడలిని చూసుకుని ఆమె పరమానందం పొందింది. ఆ కోడలు గంధర్వ చక్రవర్తి కూతురని

కొన్నాడంటే అతని పరివారాన్ని మించిన పరివారాలు బాగ్దాదులో ఎన్నో లేవు. అతను భోగభాగ్యాలతో తులతూగుతూ బాగ్దాదులో తొమ్మిది మాసాలు గడిపినాక అతని భార్య కవల పిల్లలను కన్నది. ఇద్దరూ మగబిడ్డలే, పున్నమి చంద్రుళ్ళ లాటి వాళ్ళు. వారికి నాసిర్, మన్సూర్ అని పేర్లు పెట్టుకున్నారు.

ఏడాది పూర్తి కాగానే హసన్ తన చిన్నక్కకు ఇచ్చిన మాట జ్ఞాపకం తెచ్చుకుని ప్రయాణ సన్నాహం సాగించాడు. తన అక్కలందరికీ కానుకలుగా ఇవ్వదగిన వస్తువులు కొన్నాడు. తల్లితో తన ప్రయాణం గురించి చెప్పి, "అమ్మా, అన్నిటికన్న ముఖ్యమైన సంగతి విను. నీ కోడలి పక్షి తొడుగు రహస్యస్థలంలో దాచి ఉంచాను. నేను తిరిగి వచ్చేదాకా దాన్ని ప్రాణంతో సమంగా కాపాడాలి. నీ కోడలికి కొంత పక్షిస్వభావం ఉన్నది. పొరపాటునగాని ఆమె ఆ తొడుగును చూసిందో, మిగిలిన బంధాలన్నీ కూడా ఆమెను నివారించలేవు; ఆమెకు ఎగరాలన్న కాంక్ష ప్రబలంగా కలుగుతుంది. ఆమె వెళ్ళిపోతే మరి తిరిగి రాదు. ఆమె పోతే నేను మనోవ్యాధితో మరణించటం నిశ్చయం. నిత్య విషయాలలో కూడా ఆమెను శ్రద్ధగా చూసుకో. ఆమె గారాబంగా పెరిగినది, ఉపచారాలు మరిగినది. నేను చెప్పే ఈ విషయాలు పొరపాటున కూడా ఏమరవద్దు," అన్నాడు.





''నా కింతగా చెప్పాలా, నాయనా? వయసు వచ్చి నా బుద్ధి పెడతల పట్టిందనుకున్నావా ఏం? నీవు నిశ్చింతగా వెళ్లిరా. నేను నీ భార్యను ఎలా చూసుకోవాలో అలా చూసుకుంటాను. నే నడిగేదల్లా ఒకటే: వీలయినంత త్వరగా మటుకు తిరిగి రా,'' అన్నది తల్లి.

అయితే, పాపం, రానున్నది వారిద్దరూ ఎరగరు. తమ సంభాషణను చక్రవర్తి కుమార్తె విన్న సంగతి కూడా వారికి తెలీదు.

హసన్ తన భార్యనూ, ఆమె వద్దనున్న చంటి పిల్లలనూ ముద్దాడి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

అతను రాగానే గంధర్వ రాజకుమార్తెలు అంతులేని ఆనందం పొందారు. ముఖ్యంగా చిన్నక్క సంతోషం చెప్పనలవి కాదు. ఆమె తమ భవనాన్ని పూలమాలలతోనూ, రంగు దీపాలతోనూ అలంకరించింది. హసన్ ఆమెతో తన కవల బిడ్డలను గురించి చెప్పాడు. తన అక్కలతో సరదాగా వేటకు వెళ్ళాడు. వారితో కలిసి వేడుకలన్నిటా పాల్గొన్నాడు.

హసన్ వెళ్ళినాక అతని భార్య రెండు రోజులపాటు అత్తగారిని అంటి పెట్టుకునే ఉంది. మూడోనాటి సూర్యోదయం వేళ ఆమె అత్తతో, ''నాకు స్నానశాలకు వెళ్ళాలని ఉన్నది. మంచి స్నానం చేసి ఎంతోకాలమయింది,'' అన్నది.

''అవేం మాటలే పిల్లా? ఈ ఊరు మనకు కొత్తాయె. స్నానశాల ఎక్కడో కూడా తెలియదాయె. ముందుగా వెళ్ళి ఏర్పాట్లు చెయ్యటానికి మీ ఆయన కూడా లేడాయె. ముసలి దాన్ని, నీకు తోడు కూడా రాలేనైతిని. కావాలంటే సుఖంగా తలంటి స్నానం చెయ్యటానికి కావలిసిన సరంజామా అంతా ఏర్పాటు చేసి నీళ్ళు కాస్తాను. ఇంట్లోనే హాయిగా స్నానం చెయ్యి,'' అన్నది హసన్ తల్లి.

''స్నానశాలకు వెళ్ళటానికి కూడా అభ్యంతరమైతే ఎలాగత్తా? బానిసలకైనా

ఇన్ని కట్టుబాట్లుండవే! ఇలా బతికే కన్న చావు మేలుగదా!'' అన్నది హసన్ భార్య.

తన కోడలు అంత మాట అన్నాక ముసలావిడ నొచ్చుకుని, స్నానానంతరం ధరించే బట్టలూ, పూసుకునే అత్తర్లూ తీసుకుని, ''పదవే అమ్మాయ్! నీ యిష్ట ప్రకారమే కానియ్యి. మీ ఆయనకు కోపం రాకుండా చూసే భారం ఆ అల్లాదే!'' అంటూ కోడల్ని వెంట బెట్టుకుని, బాగ్దాదు నగరంలో ఉండే స్నానశాల లన్నిటిలోకీ ప్రసిద్ధమైన దానికి తీసుకు పోయింది.

హసన్ భార్య స్నానశాలలోకి అడుగు పెట్టగానే అక్కడ ఉన్న ఆడవాళ్ళందరూ ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచి ఆమె కేసే చూడసాగారు. కొందరు చేసే చేసే స్నానాలు కూడా మాని ఆమెను చూడ వచ్చారు.

ఇదే సమయంలో రాణి జుబేదా దాసి తూఫా అనే పిల్ల ఆ స్నానశాలలో ఉండటం తటస్థించింది. అది హసన్ భార్యను స్నానశాలలో ఉన్నంతసేపూ కన్నార్పకుండా చూడటమే గాక, ఆమె తన అత్తగారితో సహా వెళ్ళిపోయేటప్పుడు వారి ఇంటిదాకా వెంట వెళ్ళి, ఆ తరవాత ఖలీఫా భవనానికి తిరిగి వచ్చి జుబేదా రాణితో తాను చూసిన స్త్రీ అందాన్ని వైన వైనాలుగా వర్ణించి చెప్పింది.

తూఫా సంగతి జుబేదాకు తెలుసును. అది కనిపించిన అందగత్తెనల్లా అంత ఆత్రంగా మెచ్చుకోదు, ఎవరి అందం గురించీ అంత పారవశ్యంతో మాట్లాడదు. అందుచేత ఈ అపురూపపు సౌందర్యరాశిని స్వయంగా చూడాలని జుబేదాకు బలమైన కోరిక కలిగింది. ఆ సౌందర్యవతి పేరు తూఫాకు తెలియదు గాని, ఆమె ఫలానా భవనంలో ఉంటున్నదని అది చెప్పింది.

ఖలీఫాకు అంగరక్షకుడుగా ఉండే మస్రూర్‌ను పిలిచి జుబేదా, ''ఫలానా భవనానికి వెళ్ళి, అందులో ఉంటున్న స్త్రీని వెంటబెట్టుకురా. ఒక్కడవే తిరిగి వచ్చావో నీ తల ఎగిరిపోతుంది,'' అన్నది.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.







Kiran Kiran

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫిబ్రవరి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దొరికింది వేట

రెండవ ఫోటో : శివడానికి పూట

పంపినవారు : ఖాదర్ ఫరీదా బేగం, జి. 27, పోర్టుక్వార్టర్స్, విశాఖపట్నం–35.

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15

కేమెల్—2వ బహుమతి రు. 10

కేమెల్—3వ బహుమతి రు. 5

కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు

కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కల పెట్టిన గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ________________________ Age __________

Address ______________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మను పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 27—2—1982

**CONTEST NO 23**

రామ్, శ్యామ్

# వెండి చారలు

ఇంటర్వెల్‌లో రావాల్సింది మాషారుకాని, కడుపునొప్పి కాదు.

























పార్లే పాపిన్స్ మజాగా నోట్లో వేసుకు నేముందర వెండిచారలకోసంచూడండి.
ఇప్పుడు నకిలీచేసేవాళ్ళు మిమ్మల్నిమోసం చేయలేరిక.

everest/81/PP/103-tl.